సర్వప్రాయంబుగా వత్సరాయుతాష్టకంబు రాజ్యంబు సేసిన నక్కాలంబు
నందు॥ ఉ॥ దేవతలెల్లఁ దక్కుఁగల దిక్పలకుల్ దివికేఁగునట్టిచోఁ-బోవఁగ లేక
కుంటికుడు పుంజిరు వేల్పులు దైత్యదానవుల్-. సేవకులై మహీవిభుని చేనధికార
నియోగవృత్తికై । జీవితమందినిల్చిరి త్యజింపఁగఁ జాలక జన్మదేశముల్॥ గీ॥ త
త్పురతమీఁ గొలిచి రాధరణినాథు । దైత్యదానవులవధూతదానవారి । పతిత
పావనూ బాలగోపాలమైన । సుట్టిపగవారిపగవారిచుట్టలగుట॥ గీ॥ విశ్వదేవగణం
బుత్రోవేఱు వేఱవచ్చి పితృదేవతలు మహీశ్వరునిఁ గొల్చి । చులకగాల్పట్టియా
డ్చినఁ జూరువట్టి । వేలుదురుగాక తనవారు విడుతురెట్లు॥ సీ॥ సిద్ధులా రాజుఁగొ
ల్చి ప్రసిద్ధిఁగాంచిరి గ్రహములకలతడను గ్రహముజూపె । విద్యాధరుండయ్యె వి
ద్యాధరులకతఁడతఁడు రుద్రులకు సౌహార్ద్రి మొసఁగె । రక్షించెనాతఁడు రక్ష
స్సమూహంబునతఁడు తార్క్ష్యులకు సఖ్యత్వమిచ్చె । మన్నించెనాతఁడు గిన్నర
వ్రాతంబు తుష్టితులనతఁడు సంతోషపఱిచె । నతినిభూతపిశాచకూశ్మాండగ
ణము । ఢాకినీప్రేతరంభలు హాకినులును । గర్కరీపాదు కాపీటికాకరంక । పేటి
కలు దాచ్చికొల్చిరి భృత్యులగుచు॥ వ॥ అవ్విధంబున రిపుంజయుండు ప్రజాపాల
నంబు పరమధర్మంబుగా శక్తిత్రయచతురుపాయషాడ్గుణ్యంబులు గాలం
బెఱింగి నడపుచుఁ బెద్దకాలంబు రాజ్యంబు సేసెఁ జాతుర్వర్ణ్యంబులు చతు
రాశ్రమంబులు తమతమధర్మంబులు తప్పక వర్తించె నపుడు వేల్పులు ధరావి
యోగవేదనాదూయమానమానసులై మరుత్వంతుం బురస్కరించి కొనిమం
తనంబుండి దివోదాసునకు రాజ్యపదభ్రంశంబెవ్విధంబున గావింతమొకో
యనివిచారంబున కుందొడంగి రప్పుడు గార్యంబు నిర్గమించి బృహస్పతియుం
డాదిదేవతలకిట్లనియె॥ క॥ ప్రాణాపాన వ్యానో । దానసమానములుదృప్తిదల
కొనఁజేయం । గానోపుదునదియన్నము । ప్రాణంబననన్నమనఁగఁ బర్యాయం
బుల్॥ గీ॥ అగ్నిమనలోన నొక్కరుఁడౌనొ కాఁడొ । చేయఁడేమారుతము మన
న చెప్పినట్లు । వరుణుఁడెవ్వరివాఁడు ముప్పూరును లేక । యాయితంబగు నెబ్బం
గినోయిరంబు॥ వ॥ వరుణానిలాగ్నులు దమతమశక్తులుపసంహరించి రేనిఁ బి
ఠకపాకంబుసాగదు పిఠకపాకంబుసాగక యోదనంబు పరిపక్వంబుగానేర
దు పరిపక్వాన్నంబు లేక వైశ్వదేవబలిహరణాది క్రియాకలాపంబులు గుంఠి
తంబులగు హవ్యకవ్యక్రియాశూన్యులయిన బ్రాహ్మణులు రాజునందు విరక్తుల
గుదురు బ్రాహ్మణులు విరక్తులైనప్పుడ తక్కినవర్ణంబుల ప్రజలు వైరాగ్యం
బువహింతురు ప్రజానురంజనంబునంగదా రాజు రాజౌట ప్రజావిరక్తిఁ గో
శదుర్గబలాది సప్తాంగంబులు పరిక్షీణంబులగు సప్తాంగపరిక్షయంబునఁ ద్రి

వర్గంబునశించుఁ ద్రివర్గనాశంబున నుభయలోక మార్గంబును ఖిలీభవిం
చుంగావున॥ గీ॥ మొదలి వైశ్వానరునినిజమూర్తిశక్తి సంహరింపంగఁదగుఁ
గాశిజనపదమున। నగ్ని లేకున్న నోగిరం బనువుపడక। రాజు ప్రజలును నెట్లంగఁ
బ్రదుకఁగలరో॥ ఉ॥ చండకరాన్వయాంబునిధి చంద్రుడు భూమిమణుండతం
డుఱా। గుండియువాఁడు వేలుపులకోటులసంఖ్యలు భూతధాత్రిపై నుండఁగనీ
క కాశిపురి నొక్కఁడు రాజ్యము సేయు చుట్టులే। దంశికి మెచ్చినారము ప్ర
తాపవిహీనుఁడు భూమిపాలుఁడే॥ గీ॥ అనిన నాచార్యవచనంబు లాదరించి।
యింద్రుఁడనుపఁగ ధాత్రికి నేగెనగ్ని। మొదలఁ గాశీపురమునకు ముట్టడముగ।
సకలగృహములఁ దనమూర్తి సంగ్రహించె॥ మ॥ కరిమాశ్చర్యముగాఁ బ్రతిక్ష
యమునం గాష్ఠంబులందగ్ని దే। వరనిప్పచ్చకమై యడంగుడయు సర్వస్త్రీలు
పాకక్రియా। పరతల్లక్కిరి యాయుజాకభవనపాగ్న్యంశమధ్యంబులన్। వరి
బియ్యంబడయొల్కి పీడును స్వధాస్వాహావషట్కారముల్॥ ఉ॥ యంత్రితభ
క్తిభావముననగ్ని సమింధనిసామిధేనిరు। జ్మంత్రములుచ్చరించుచు సమగ్రత
రారణిమంథనక్రియా। తంత్రమునాచరించి వసుధామరముఖ్యులు వీతిహో
త్రునా। మంత్రణ సేయలేరయిరిమచ్చరకించియుఁగాశికాపురిన్॥ ఆసమయం
బున॥ ఉ॥ భూపతిసమ్ముఖంబునకుఁ బోయికరద్వయముల్మొగిడ్చి విజ్ఞాపన సే
సె నాంధసికసంఘము మెల్లనకొంకికొంకియు। స్తోపకరోక్తిఁ జెప్పెదు నెడం
గడునజ్ఞులసీతి మోవనం। బ్రాపిలు మేదినీశ్వరులమానసముల్ద్రిరిశంపు పూవు
లర్॥ గీ॥ అవధరింపుము నీప్రతాపాతిశయము। గరిమమునకోర్వ హోటించి మోకా
నివహ్ని। కాశికాపట్టణమున నివేశమునకుఁ। బదిలమై యుండనోపక పారిపో
యె॥ ఉ॥ అంబుజబాంధవాన్వయ నృపాగ్రణి బోనము నేఁడు సూర్యపా - కం
బుననాయితంబయిన ఖజ్జము భోజనశాలలోనఁ బ - ళ్యంబిడినారు పంకజద
ళాక్షులు రెండవజాముఘంట మ్రోయుబడెనారగింపసమయంబని చెప్పర
విన్నవించిరన్॥ గీ॥ వేల్పులోనరించినట్టిదుర్వృత్తియగుట - నెఱిఁగియుంతియ
కాకరొండేమియనుచు - నారగించె దివోదాసుఁడర్కకిరణ - తాపపక్వంబు
లగుపదార్థంబులెలమి॥ వ॥ భోజనానంతరంబయాస్థానమధ్యంబునం గొలు
వుండి దివోదాసుండు వాసవాదులు సేసినయపకారంబునకుఁ బ్రతికారంబు
చింతించుచున్న యవసరంబునఁ బౌరజానపదులగుజను లగ్నితిరోధానంబున
కుభయంబంది యమ్మహోత్పాతంబు విన్నవింపనేతెంచిన॥ ఉ॥ అందఱనా
దరించి మిహిరాన్వయముఖ్యుడు వారియాత్మలా। నందిమఁ బొంద నిట్లనిమె
నాకనివాసులు సేసినట్టికీ - డొందునె నన్ను మీరు వెఱకుండుఁడు భూప్రజలా

రనేఁడయా-నందవనంబునందుదహనంబుఘటించెద యోగసంపదల॥ మ॥ అ
నుమానింపకయానుధాంధసులు మాయాకల్పనావంచనం-బునఁబై శ్వానరు
న్విహారించిరియప్పుడంబోయింతమాత్రంబులో। ననునాయోగమహానుభావము
నకుల్గభంగంబువాటిల్లునే। సనెకల్గాంచినఁబెంస్లిమానునొకో దుశ్చారిత్రము
ల్గటిరే॥ సీ॥ దహనస్వరూపంబుదాల్చి యేఁగ్రైకొందుహవ్యకవ్యాహుతులధ్వ
రములఁ। బర్జన్యమూర్తిఁజేపట్టియేనకురింతుసలిలధారలుసస్యములుఫలింప। శ
శిదివాకరులవేషముదాల్చికొనియేనఖండింతుగాఢాంధకారపటలిఁ। జనను
నాకారంబుభరియించి యేనుబ్రాణ్యంతర్బహిర్వ్యాప్తినాదరింతు। వేల్పు
లందఱునేనయైవివిధకృతులఁ। విశ్వలోకంబురక్షింతువేయునేల। యింక నా
దానికటనేనయేలువాఁడ। నాగలోకంబునాకంబుయోగశక్తి॥ వ॥ అనియోగ
విద్యాబలంబునసర్వదేవతామయుండై దివోదాసుండురాజ్యంబుసేయుచుండ
జె నంతనటఁబరమేశ్వరుండుమందరాచలంబునందధివసించి కాశీవియోగవే
దనాదూయమానమానసుండై తత్సమాగమోపాయంబుఁజింతించుచుండెన
ప్పుడు॥ గీ॥ అభవుఁడింకుకళాధరుఁడయ్యునమర। వాహినీధరుఁడయ్యుదుర్వా
రమైన। కాశికావిప్రయోగాభిఘాతజనిత। తాపభారంబు సైరింపనోపఁడ
య్యె॥ వ॥ అంతనొక్కనాఁడద్దేవుండు గజాననసింహముఖగృధ్రాస్యకాకతుం
డికయుష్ట్రగ్రీవహయగ్రీవవారాహిశరభానన యులూకిక శివారావమయూరి
వికటానన యష్టవక్త్రకోటరాక్షి కుబ్జవికటలోచనశుష్కోదర లలజ్జిహ్వాదం
ష్ట్రోగ్రగవావరాననముక్తాక్షి కేకరాక్షి మహాతుండసురాప్రియకపాలర క్తరక్తా
క్షి శుకి-శ్యేని-కపోతిక-పాశహస్త-దండహస్త-ప్రచండ-చండవిక్రమ- శిశు
ఘ్ని-కపాలహర్త్రీ-చకోరి-రుధిరపాయిని-గర్భభక్షిణి-యశనహస్త-యాం
త్రమాలిని-స్థూలకేశి-బృహత్కుక్షి-సర్పాస్య-దందశూక-కర-క్రౌంచి-మృ
గశీర్ష-వృషానన-యంత్రశ్యామ-ధూమనిశ్వాస-వ్యోమైకచరిత-యూర్ధ్వ
దృక్ - తాపని - శోషిణి - వృకోదరి - స్థూలనాసిక - విద్యుత్ప్ర
భ - మార్జాలి - పూతన - యట్టాట్టహాస - కామాక్షి - యనునీచతు
ష్షష్టియోగినులరావించి మీరు నానాప్రకారమాయావేష చేష్టావిడంబంబు
లం గాశీనగరంబువంబున్యస్త్రీలపాతివ్రత్యంబులుపురుషులయాచారంబులు
చెఱుచునది వర్ణాశ్రమంబులునిజధర్మంబునవర్తింపకున్న దివోదాసుండు రా
జ్యపదభ్రంశంబునుంబొందెడు నప్పుడుగాని మాకుఁగాశీసమాగమంబుసిద్ధిం
పదనిన వారును మహాప్రసాదంబని ॥ సీ॥ పుష్పలావికయోషాభూమికఁ దీ
యుఘోషగంధవాహినియోతోఁకర్తులంజె। హస్తాంఘ్రిరేఖాసమాలో

కనక్రియాసాముద్రికజ్ఞానచతురయోర్తు। సలిలాగ్నివాయ్వాయుస్తంభవిద్యా
కళాప్రావీణ్యయోర్తుసైరంధ్రియోర్తు। మాసకమ్మయొకర్తు మంత్రవాదిని
యోర్తురంగవల్లివిచిత్రరచననిపుణ। చదువఁజూడంగనర్తింపసరసమాడఁ। క
థలుసెప్పంగనగ్గింపఁగన్నులార్ప। వీణవాయింపఁబాగడంగవిరులుగట్ట। నేర్పు
నట్టిదియొకరితనియతయోర్తు॥ వ॥ ఇవ్విధంబుల నానారూపవిధంబులుగై
కొనివారణాసికింజని రనంతరంబ॥ గీ॥ మనసిజారాతిసిద్ధయోగినులఁబంపి। యూ
రడిలియుండఁజాలకయుష్ణకరుని। నని చెంగాశీనగరికివృత్తాంతమరయఁ। గౌతుక
ముగాలయాపనార్థమముగాదు॥ సీ॥ పురవైరిరవిగాశిపురికిన్నుపన్పఁడే కాంతం
బు సేసియిట్లనుచుఁబలికె। వాసరాధిపదివోదాసుధర్మాత్ముని నేయుపాయంబున
నేనిధర్మ। విముఖుఁగావింపుమువిశేయంగనాడకుధర్మమార్గైకతత్పరునివత
ని। మనమాదరింపకుండినధర్మమెబ్బంగినభివృద్ధిఁబొందుఁగావుననయంబు। ద
ప్పకుండదు నెడనొకతప్పవెతుకు। మత్సరాహంకృతులనుగామమునుగ్రోధ।
మోహములఁబ్రత్యవాయంబుమూఁదలించు। దప్పలేకయుశిక్షింపఁదగవు
గాదు॥ గీ॥ కదలకుండునుమది నెంతకాలమేని। ధర్మమతిసుస్థిరంబగుకర్మసా
క్షి। యెంతకాలమునరునకునావహిల్ల। దేయుపాయంబునీసూక్ష్మమెఱఁగి
కొనుము॥ వ॥ అని చెప్పినంబ్రసాదంబనిశివాజ్ఞ శిరంబునవహించి రవిగాశీపురం
బునకరిగి యాచకుం డొక్కొక్కమాటు దూతయొక్కమాటు వదాన్యుం
డొక్కమాటు దీనుం డొక్కొక్కమాటుగార్తాంతికుండొక్కొక్కమాటు
దృష్టప్రత్యయవాది యొక్కొక్కమాటుజటిలుం డొక్కమాటుదిగంబరుం
డొక్కొక్కమాటుజాంగలికుం డొక్కొక్కమాటుపాషండుం డొక్కొ
క్కమాటుబ్రహ్మచారి యొక్కొక్కమాటుగృహి యొక్కొక్కమాటు వా
నప్రస్థుండొక్కొక్కమాటుయతియై నానాప్రకారవేషభాషాచేష్టాయంత్ర
మంత్రతంత్రమాయాప్రయోగబలంబున ॥ గీ ॥ ఇన్నివిధములజనియించియు
నుఁడుగాశి। వ్రణముగానంగలేఁడయ్యెరాజునందు। నవికరంబుమహీపాలునం
దయేల। కనఁగఁలేఁడయ్యెనొకవృద్ధజనునియందు॥ వ॥ ఇట్లువిఫలప్రయత్నుం
డయి యినుండునిజాంతర్గతంబున॥ సీ॥ కార్యంబునివృత్తిగతికిరాకుండంగమం
దరంబునకెట్లుమరలిపోదు। అదెవచ్చెనిదెవచ్చెననినాకెదురుచూచునీశునీ
క్షింతునే నేమొగమునఁ। బతియాజ్ఞనిర్వహింపకకానిదేవతాప్రమథులందే నె
ట్లుప్రభుతఁగాంతు। నొచ్చెంబుధరియించియొదిగియుండకయెట్లు నిటలలోచ
నుమ్రోలనిలుచువాఁడఁ। గనలియున్నాఁడు నేఁడెల్లి కాశివిరహ। వేదనాతిభ
రముచేతివేగిభర్గుఁ। డడ్డపడువారెవ్వరలతఁడలిగినపుడు। గాననిచటనకాలం

బుగడపువాఁడ॥ వ॥ హరిశ్చంద్రశిబిదధీచిప్రముఖులగు పెద్దలుం గాశీసంసేవ
నంబున సంసారదుఃఖంబులుద్వర్జించిరని పరిభావజ్ఞుండగుభాస్కరుండులోలా
ర్కుండనను త్తరార్కుండనసాంబాదిత్యుండనగరుడాదిత్యుండనమయూఖా
దిత్యుండనఖఖోల్కాదిత్యుండనరుణాదిత్యుండనవృద్ధాదిత్యుండనవిమలాది
త్యుండనగంగాదిత్యుండనయమాదిత్యుండనం బంద్రెండుమూర్తులువహించి
కాశీపురంబునందధివసించెఁ గాశీవాసనిమిత్తంబుగామనంబులోలంబగుటలో
లార్కుండయ్యెఁ గ్రమంబుననీయాదిత్యులప్రభావంబభివర్ణించెదనాకర్ణింపు
ము॥ సీ॥ కాశీపురికిను త్తరాశాప్రదేశంబునందునుండుటను త్తరార్కుఁడయ్యె।
నితిహాసమొకటినయ్యునినిమహాత్మ్యంబుసంప్రకాశమొనర్పఁజాలెదునది। వి
నుపింతువినుకాశివిప్రుఁడొక్కఁడుసదాచారసంపన్నుఁడుశాంతిశాలి। యతిథి
ప్రియుఁడుప్రియవ్రతుఁడనుపేరివాఁడతనిభార్యశుభవ్రతాభిధాన। దంపతులు
వారికుదయించెఁదనయయొక్కర్తు। మూలనక్షత్రమునయందుమొదటికాల।
కేంద్రముననాంగిరసుఁడుండఁజంద్రవదన। బాలవర్ధిల్లెరూపసంపదసుదాను॥
గీ॥ దానిపేరుసులక్షణమానివర్య। సర్వలక్షణసౌభాగ్యజన్మభూమి। బాల
యంతంతవర్ధిల్లెఁబ్రతిదినంబుఁ। జింతతండ్రికివర్ధిల్లెనంతకంత॥ గీ॥ తగినవరుఁడె
వ్వాఁడొక్కొయీతలిరుబోఁడి। కనుగుణుండెవ్వాఁడొకొవిశుద్ధాభిజాత్య। పర
మసౌభాగ్యభాగ్యసంపదలకనుచు। నిత్యమునుఁదండ్రియాత్మఁజింతించుచుం
డె॥ గీ॥ మూలనక్షత్రమునయందుమొదలికాల। కన్యగండానఁబుట్టినకారణా
మునఁ। గర్మకుఁడువిప్రుఁడానందకాననమునఁ। జచ్చెఁజింతాజ్వరముపైనజ్వర
ముదాఁకి॥ వ॥ శుభవ్రతయునుంబతివనుగమించెసులక్షణదుఃఖావేశయయ్యు
సుధీరోదాత్తగావునఁ దాత్పర్యంబునం దలిదండ్రులకౌర్ధ్వదైహికవిధులుని
ర్వర్తించినిజాంతర్గతంబున॥ సీ॥ ప్రాణంబుప్రాణంబులైనతల్లినిదండ్రి
హృదయంబులోననే నెట్టుమఱతుఁ। బితృమాతృహీననైయతినైచ్యవృ
త్తినే నెబ్భంగినీఁదుదునీభవాబ్ధి। నేలకల్పించెనాకీరూపలావణ్య సౌభాగ్య
సంపదజలజభవుఁడు। కులశీలరూపాదిగుణములువీక్షించియెవ్వారికీనేర్తునే
ననన్ను। ననుచునిర్వేదమునఁబొందెనలరుబోఁడి। పురుషునెవ్వనిఁజిత్తం
బుచేరఁగనీక। బ్రహ్మచర్యవ్రతస్థితిఁబదిలపఱచి। యుత్తరార్కునికడఁజే
సెనుగ్రతపము॥ ఉ॥ నిత్యమునిష్ఠతోడధరణీసురకన్యకకాశినుత్తరా; ది
త్యునిపార్శ్వదేశమునఁ దీవ్రతపంబొనరింపవచ్చి సాం। గత్యముచేసెఁగూ
ర్మిచెలికత్తియకైవడినొక్కమేఁకసం। ప్రీత్యనులబ్ధినంగనయుఁ బ్రేమమొ
నర్చుచునుండెదానిపై॥ గీ॥ రాత్రిదూర్వాప్రవాళచర్వణమొనర్చి। యు

త్తరాదిత్యకుండికనుదకమాడి । పగలునాల్జాలు సేవించుచుఁబద్మనయన । వత్స
లతమీఱ సెలఁబ్రోఁకనయసు మేఁక॥ వ॥ అంతం బెద్దగాలంబున నీలలోహితుం
డు ప్రత్యక్షంబై వరంబు వేఁడుమనిన సులక్షణయు వ్విరూపాక్షునకుఁ బ్రణమిల్లి
యిట్లనియె॥ గీ॥ మీనకేతనదమన యీ మేఁకపిల్ల । ప్రాణసఖివోలె నాయొద్దఁ బా
యకుండు । శర్వ యీ నోరుమాలిన జంతువునకు । మొదలిపదమిమ్ము వరమిమ్ము పి
దప నాకు । వ॥ అనిన విని శంకరుండు గరుణాకింకరుండై సకలగాత్రాంకురంబునం గు
రంగాక్షిం గనుంగొని గౌరీహృదయానురాగంబున బర్కరియున్యజన్మంబునం
గాశిరాజపట్టపు దేవికిం గూతురై పుట్టుఁగావరంబొసంగిన బర్కరి పేరనయ్యుత్త
రాదిత్యకుండంబు బర్కరీకుండంబనంబరఁగె గుణానురాగిణియైన గౌరిసులక్ష
ణాఁదనకుం జెలికత్తియఁగాఁగైకొని విజయజయాంకిత శుభనందసునంద కౌ
ముదియూర్మిళ చంపకమాలమలయద కర్పూరతిలక విశోకకమలగంధినిచం
దననిశ్వాసమృగముద్రోత్తమకోకిలాలాపమధురభాషిణి గద్యపద్యనిధియను
స్త్రిజ్ఞమొదలయిన చెలికత్తియలనుంబోలె బాలబ్రహ్మచారిణియయిన య
య్యాలివేణి నాదరించెనిది యుత్తరార్క మాహాత్మ్యంబనుటయు నైమిశా
రణ్యవాసులు మహాత్మా యింకనుం గాశికానగర పంచక్రోశ పుణ్యక్షేత్రంబు
నంగల దేవతాస్థానంబులు పుణ్యతీర్థంబులు వివరించి మమ్ముం గృతార్థులం జేయు
మనుటయు. పంచమాశ్వాసము - సమాప్తము.



## కాశీఖండము - షష్ఠాశ్వాసము.

---

అశ్రిలకటాక్షవీక్షణ । విశ్రాణనవిభవవిజితవిహాయాధరవ । స్థాణ్వాశ్రమర
క్షాతత్పర । యాశ్రితమందార రెడ్డియల్లయవీరా॥ వ॥ అక్కథకుండు శౌనకా
దిమహామునులకిట్లనియె॥ సీ॥ యదువంశమునయందు నవనిభారాపనోదార్థం
బుదుష్టదైత్యావలేప । హరణార్థముగఁబుట్టె నంభోజనాభుండు దేవకీకివసు
దేవునకును । ద్వారవతీపురాధ్యక్షుండునై దైత్యారి యవరోధకాంతాసహస్రి
ములకుఁ గాంచె నందనులలక్షయు నెనుబది వేలమాన్యులై నప్రధానమహిషు
లందు । జాంబవతియను దేవికి సాంబుగనియె । నక్కుమారుండు లేఁతప్రాయం
బునందు నేధినొకనాఁడు సఖులతో విహృతిసలుప । నెచటనుండియొ నారదుం
డేగుదెంచె॥ క॥ ఆటతమకమున నమ్మధు । కైటభరిపునందనుండు గౌరవబుద్ధిన్ ।
బాటింపనేరఁడయ్యెను హాటకగర్భునితనూజు నభ్యాగతునిన్॥ ఉ॥ తోఁడికుమా

రులుఁ సఖులుసూరమునందకెరారవిందములఁ । మోడిచిఫాలభాగమున మోపి
నమస్కృతులాచరింపఁగా । నాడుచునుండెగానిమునికంజలి సేయఁగ సేరఁ
డయ్యెన । ప్వేడుక కాఁడుపుట్టదొక వేళవివేమఁదొడ్డవారికిన్ ॥ చ॥ త్రిదశమునీ
శ్వరుండును మదింగలుషంబొక మూలనుండఁగా । యదుకులసార్వభౌముఁగని
యర్చనఁగైకొనియిష్టగోష్ఠితో । ముదితలనమ్మయేమరుటమోసనుమీయని
బుద్ధి చెప్పెన । చ్చదురున సన్న సేయఁదగ జాంబవతీసుతు నెన్నె ధూర్తుగాన్ ॥
గీ॥ ఎన్నియాతో యమునమిన్న కేగదివికి । నారదుఁడు శౌరిచేతసత్కారమొంది
నెరసుపొడగాలేఁడయ్యె నెమకి నెమకి । సాంబుపైఁ బాంచజన్యరథాంగపా
ణి॥ వ॥ అంతఁగొన్నిదినంబులకు॥ గీ॥ సాంబునడఁచినదాఁకవ్రతంబుపట్టి । జలజ
సంభవతనయుండుచలపకారి । ద్వారవతికేగుదెంచె నంతఃపురములఁ । బుండరీ
కవిలోచనుండుండు టెఱిఁగి॥ గీ॥ వెదకిసాంబునిఁబొడగాంచివిబుధమౌని । హ
రికిఁదనరాక నెఱిఁగింపుమనుచుబలికెఁ । బోవుటనుచిత మెప్పుడుపోవకునికి ।
యేమి సేయుదుననియాతఁడిచ్చఁదలఁకె॥ వ॥ ఎట్టకేలకు శుద్ధాంతగతుండై న
తండ్రిసమీపంబునకరిగి యవ్వేళగమనాపరాధంబుకారణంబుగా శౌరిచేతఁ
గుష్ఠవ్యాధిబాధితుండుగా శపింపంబడి సాంబుండు॥ గీ॥ తండ్రికిని నారదునికి
వందనము సేసి । జాంబవతిపట్టి శాపావసానమెఱిఁగెఁ । గాశికరుగేగి యత్యంత
గాఢభక్తి । భాను సేవింపఁ వ్యాధిమానుననియు॥ వ॥ ఇట్లు నారదానుమతిం
గృష్ణుచేతశాపమోక్షప్రకారం బెఱింగి సాంబుండు కాశికరిగి తదుపదిష్టమార్గం
బున భాను సేవించి కుష్ఠవ్యాధిబాధావిముక్తుండయ్యె నిదిసాంబాదిత్యమాహా
త్మ్యంబు॥ సీ॥ వరమునంయమి కశ్యపప్రజాపతికి వినతకాత్మజుఁడై న విహగభ
ర్త । విషధికుక్షి నిపాదవిశాలిభక్షించుచో ద్విజుఁగాంచి యుమిసినవిమలబుద్ధి ।
యిభకచ్ఛపములరోహిణిశాఖతోఁ దాల్చిదివిమీఁదఁ బారినపవనవేగి । యమ
రకోటిఁగెల్చి చిచ్చార్చి చక్రముదూరి యమృతంబుఁదెచ్చినయసమబలుఁడు ।
జిష్ణుపవికొక్కయీఁకయిచ్చినప్రదాత । యచ్యుతునివాహనము తార్క్ష్యుఁడగ్ర
జులును । దాసుఁదల్లియుఁ గాశికాస్థలమునందుఁ । గొలిచిరర్కులనలువుర
కుంభజన్మ॥ వ॥ అని చెప్పిన విని యగస్త్యుఁ గుమారస్తంబులు మొగిడ్చి పార్వతీహృ
దయానందవర్ధనకుమార యొక్క సందేహంబునడిగెదం దెలియనానతిమ్ము ద
క్షప్రజాపతిపుత్రిక కశ్యపప్రజాపతిపరిగ్రహం బీగరుత్మంతుని జననివినత యేమికా
రణమున దాస్యంబువహించెననియడుగుటయు శాహ్లేయుండు కుంభసంభ
వునకిట్లనియె॥ గీ॥ సవతికద్రువ శేషతక్షకులు మొదలు । గాఁగ వేవురుభుజగ
పుంగవులఁ గాంచె । నందనులమూఁటిఁగలధౌతగండశైల । సన్నిభంబులఁ

గనేఁ బుణ్యసాధ్వి వినత॥ ఉ॥ అదిఁకుమైనయండమునయందుదయించెను గూ
బపుల్గుసూ। రోర్వదయవేళ ముజ్జగమును బ్బరఁబోవఁ గనయ్యులాళమ। ష్టాద
శసంఖ్యదీవులకు సర్వవిహంగమకోటికిన్ మహా। హ్లాదముగావహించెనులలా
టమునందధిరాజపట్టముఁగా॥ గీ॥ ఖగములకు నాదిజంబైనకారణమున। సమ్మ
తించి విహంగమజాతి మొదల। కౌశికము రాజ్యయోగ్యంబుగాదటంచు। న
గిరెఁ బిమ్మట దుర్లక్షణములు సూచి॥ సీ॥ భంగించినట్లుండుఁ బడఁతమాటికి
మాటి కూర్ధ్వకంపంబు సేయుటకతాన। జంకించినట్లుండు శ్రవణనిష్ఠురముగా
జెలఁగి ఘూత్కారంబు సేసెనేని। బెదరించినట్లుండుఁ బృథువర్తులములైన
దృగ్గోళకంబులు దిరుఁగఁబడిన। గర్వించినట్లుండు ఘస్రంబు నాల్గాలు నెదిరిఁద
న్నునుఁగాంచ నెఱుక లేమిఁ। బుట్టుపుణ్యంబు మాలిన చెట్టపులుఁగు। గూబ
యొక్కడఁ గలహంసకోకకీర। నీలకంఠాదిబహుపక్షినివహరాజ్య। భారమె
క్కడ నిదియుసంబంధమనుచు॥ వ॥ కులము పెద్దలు పరాభవించిన॥ ఉ॥ గద్ది
యడిగ్గి కౌశికుఁడు గాదిలి సూనుఁడు గొండవట్టినన్। ముద్దియదక్షుకూఁతురు
వినూధత రెండవపుత్రు సైతనుం। దద్దయు వేడ్క జూతుననితాలిమి లేకసఖాం
డురంబున। స్విద్దము చేసె మైసగము నిండని గర్భముతోడియండమున్॥ వ॥
అపరార్ధకాయహీనుండును బూర్వార్ధతనుండును నైనపుత్రుండనూరుండన
నుద్భవించి యుపకారంబు సేసిన తల్లిం గినిసి సవతికి దాసివి గమ్మని శపియించిన॥
సీ॥ ఏలరా నాయన్న యేకాపరాధంబు సైరింపనైతివి శాపమునకు। మోక్షమె
న్నఁడు గల్గునక్షీణకారుణ్య గరిమఁ జెప్పర యాత్మ గలఁగెనాకు। ననవుడుఁ
బిచ్చికుంటమ్మతో నిన్ను నేనూఱువర్షంబు లేగుసంత। మూఁడవయోయం
డమున నుద్భవించిన తనయుండు తల్లి నీదాస్యముడుపు। నేమరక దీని రక్షింపు
మీవు నియతి। ననుచు బుద్ధులు చెప్పి యయ్యరుణుఁడరిగె। జననియును మతిఁ
గాశికాస్థానమునకుఁ। దారకబ్రహ్మవిద్యానిదానమునకు॥ వ॥ ఆశాపంబు
కారణంబుగా నొక్కనాఁడు కద్రూవినతలు సముద్రతీరంబున వినోదార్థంబు వి
హరించువారు వేలావనధిప్రాంతంబున మరుత్వంతుని తురంగంబుచ్చై
శ్శ్రవంబు మేయుచున్నం గనుంగొని వినత యోహోహో యీ హయోత్తమంబిం
త యొప్పైన మహాపురుషకీర్తిపూరంబునుం బోలెఁ గాఁతిని జంద్రచం
ద్రికాధవళంబయి యున్నయది యనిన గద్రువ యేకన్నులం గనుంగొంటి వీతు
రంగంబునందు నిందుబింబమునందుఁ గందునుం బోలె వాలధియందు వాలం
బులొక్కకొన్ని నీలంబులయి యున్నయవి యనిపలికె నౌనని యునుం గాదనియు
నుం గొంతతడవు విద్ధలువాదంబు సేసి దాస్యంబు పణంబుగాఁ జన్నిదంబు చేతి

చిరప్రౌఢుసకుం బ్రొద్దుచాలమినిజవాసంబులకరిగిరి మఱునాఁడు ప్రా
తఃకాలంబునఁ గద్రువకొడుకులంబనిచినం గొందఱకార్యంబు సమ్మ
తింపకకినుకకంబడిరి. గొందఱువాలమాత్ర సూక్ష్మాకారంబులువహించి
వాలంబునందు బ్రేలిరి వినతయోటుపడి కద్రువకుదాస్యంబు సేయుచుం
డె. మఱియేనూఱువత్సరంబులకుఁ దృతీయాండంబునం దుదయించిన
గరుత్మంతునవలన నమృతాపహరణంబు నిష్క్రయంబుగా దాస్యంబువలన
విముక్తింబొందెఁ గుంభసంభవనీయుడిగిన ప్రశ్నంబులకు నిది ప్రత్యుత్తరం
బు॥ సీ॥ పక్షిసామ్రాజ్య సంపత్ప్రదభర్గింశంబుఁ బొందిన పెనుగూబపు
లుఁగుజేఁడు। కటిభాగమునకథఃకాయంబు శేషంబు పేలవంబగు జుట్టుపి
చ్చుగుంటు। సవతికేనూఱువత్సరములదాఁక దాస్యంబు సేసి కృశాంగియైనవి
నత। యనిలాశనములవీఁపునంబెద్దకాలంబుభరియించితిరిగినపక్షిరాజు। తల్లి
నలువురుగాశికాస్థానసీమ। హరున్ప్రతినిధులై సభాస్కరులఁ గొలిచి। యచి
రకాలంబుననయభీష్టార్థసిద్ధిఁ। గనిరి ప్రతిబంధములువాసిక లశజన్మ॥ వ॥ గరుడుని
పేరఁ గరుడాదిత్యుండునునులూకంబుపేరమయూఖాదిత్యుండను వినతపేర
ఘషోల్కాదిత్యుండును నరుణుని పేరనరుణాదిత్యుండును ననంబరగిరింక వృ
ద్ధాదిత్య కేశవాదిత్యవిమలాదిత్య గంగాదిత్య యమాదిత్యుల మాహాత్మ్యం
బు సెప్పెదనాకర్ణింపుము॥ సీ॥ వృద్ధహారీతుండువృద్ధత్వమునఁ బాసితరుణుఁడై
హరిఁగొల్చివరముపడసె। నాదికేశవదేవుఁడభ్యాసమునసుబ్బ యనిశంబుగొ
ల్చినయర్కమూర్తి। విమలాహ్వయుఁడురాజుగమలబంధుభజించిప్రబలకు
ష్ఠవ్యాధిబాధఁ బాసెఁ। దొల్లిగంగభగీరథుఁడు దెచ్చునప్పుడ న్నదిజూచివిను
తించినాఁడుధరణి। యముఁడుయమతీర్థమునఁ దండ్రినర్కుఁ గొల్చి। తపముగా
వించిపడసెఁ దత్కరుణసిద్ధి। నిదియెచిహ్నంబులగుఁ గానినిసులపేళ్లు। వాటమై
యుండుధరవాని. వానివలన॥ వ॥ వెండియుంగాశీవియోగ వేదనాక్రాంత
స్వాంతుండై యంధకారాతి తద్వృత్తాంతశ్రవణకుతూహలంబున విధాత
మహాపరేతనిలయులబునకుంబంచువాఁడై యవ్విరించిరావించి యిట్లనియె॥
ఉ॥ పోయెనుయోగినీబలముపోయెనుభానుబోయెఁ బిమ్మటం। దోయజబాం
ధవుండతఁడునుండడసెఁ గడునీరుచూడఁగాఁ। బోయినయట్టితామరలపోలికి
నందఱుగాశిఁ జిక్కిరి। తోయమునీవువోద్రుహిణతొల్లిటివారలయట్లకాకుమీ
వ॥ అనినంబ్రసాదంబనిపూని బ్రహ్మవృద్ధబ్రాహ్మణవేషంబునఁ గాశిఁ బ్ర
వేశించి పోరోలగంబున్నదివోదాసునాశీర్వదించియిట్లనియె॥ గీ॥ అధిపయా
నందకాననాఖ్య తరముస। యజ్ఞములు సేయువాఁడసీయభ్యనుజ్ఞ। ననుమతిం

వు మసాహాయ్య మాచరించు । రాజునడపింప కెల్లుధర్మంబు నడచు॥ గీ॥ అకట
విశ్వేశ్వరుఁడు లేమిన సదవోలె । నున్న యది కాశికాపురి యోన్నృపాల । యున్న
వేల్పులు రాకున్న నుండ్రుగాని । వామదేవుని రప్పింపవలెసుమయ్య॥ వ॥ అని
మ్మైపోఁగానాడి యర్థాంగీకారంబు వడసి ధాతదశాశ్వమేధ యాగంబులు
సుప్రయోగంబులుగా నాహరించి బ్రహ్మేశ్వర దేవుం బ్రతిష్ఠించి భాగీర
థీపశ్చిమతీరంబున నంతర్గృహంబున దక్షిణద్వారంబున దశాశ్వమేధంబు స
ర్వతీర్థోత్తమంబు॥ గీ॥ ధాతగాశీపురంబునఁ దడయుటయును । నుల్లమునయం
దుఁగోపింపకున్న శివుఁడు । రాజమాళికినుగా త్ర్యంతరంబుగా దె । గణనసేయం
గ నానందకాననంబు॥ వ॥ అప్పుడు గౌరీకాంతుండు నిజాంతర్గతంబున యోగినీ
బృందంబు మునువెలివన్వంతుండు వెనుకమఱచె నంభోజసంభవుండును గదల
నికంబంబయ్యె నికుంభరమవిశ్వాసనిధులగు ప్రముఖులం బంచెదం గాక యు
నిజహుమ్మానపురస్సరంబుగా నొక్కతోయంబున శంకుకర్ణ మహాకర్ణులను
నొక్కవగఘంటాకర్ణ మహాకాళులను నొక్కకడ సోమనందినంది శేషకాహా
ళపింగళకుక్కుటులను నొక్కవర్గంబును గుండోదరమయూరబాణగోకర్ణుల
ను నొక్కమొత్తంబునందిలకర్ణాస్థాలకర్ణద్రుమిచండప్రభామయ సుకేశి
ఛాగలేయకపర్దిపింగాక్షవీరభద్రకిరాతచతుర్ముఖనికుంభ పంచాక్ష సార
భూతపక్షత్షేమకలిరాధసుముఖాదులసుంబంచిన॥ గీ॥ భర్త పనిపూనినిజము
గాఁ బ్రతినవట్టి । పోదురానందకాననంబునకుఁ బోయి । మోహమాహాత్మ్యమె
ట్టిదో మునివరేణ్య । ప్రమథులప్పుడు మఱతురు భవునియాజ్ఞ॥ శా॥ నేమంబొప్పఁ
గఁ గాశికానగరి కివ్విశ్వేశ్వరాజ్ఞా మహా । సామర్థ్యంబు జటాకిరీటములపై సం
ధించిమున్నోప్పయిత । త్రిసమాంతంబున నంతయున్న అచియాసిద్ధుల్ శివార్చార
తిఁ । స్వామిద్రోహమువాపికొంద్రెచట నెచ్చున్వచుఁ దజ్ఞానమ్ముల్॥ వ॥ అం
దుంగపర్దియను ప్రమథుండు ప్రతిష్ఠించిన కపర్దీశ్వరలింగంబు ప్రభావంబు
పన్యసించెద నాకర్ణింపుము॥ సీ॥ కాశికుత్తరదిక్ప్రదేశంబునందును విమలోద
కంబను కమలసరసియాబావి తేటనీరాస్వాదించిననందుఁ దీర్థమాడినఁ బిశ్రదే
నతాళికతిభక్తిఁ దర్పణంబాచరించినమర్త్యుఁడఘకోటిఁ దునిమిలూటాడఁజా
లు । నీయర్థమున నొక్కయితిహాసమేనీకుఁ జెప్పెద దృఢభక్తిఁ జిత్తగింపు । మా
దిఁ ద్రేతాయుగంబున యందొకండు । హరునిభక్తుఁడు వాల్మీకియనఁగఁగలఁ
డు । వాఁడు హేమంతఋతుకాలవాసరములఁ । దివిరియుక్కుండములయందుఁ
దీర్థమాడు॥ వ॥ ఒక్కనాఁడు మధ్యాహ్నవేళ నవ్వాల్మీకి విమలోదకుండంబు
నం గుర్పిఁక వెట్టియనంతరంబ యాపాదమస్తంబుగా భస్మోద్ధూళనంబు సేసి

రుద్రాక్షమాలికలు ధరియించి కపర్దీశ్వర మహాదేవు సమ్ముఖంబునం బంచాక్ష
రీ పంచబ్రహ్మ శతరుద్రాది మంత్రంబుల ధ్రువమఠప్రతిమఠం బకరాస
కాదుల వేలాకరణాకీవర్ణన్యాయముల గుగూఢశబ్దభేదంబులు నెడనెడ ఝంఝం
హుంహుం ప్రధాన నానాస్తోత్ర శబ్దాక్షరంబులు సరిగమాది స్వరంబులు దివ్య
స్తుతిపదంబులు త్రిపురవిజయ దక్షాధ్వరధ్వంసాది బిరుదంబులు శంఖమురజా
దివాద్యంబులు దినంబును సంఘటించి ప్రస్ఫురితాందోళిత తంత్రిభిన్నాది
గమకభేదంబులతోడ నయ్యాయి ప్రయోగంబుల నాహతప్రత్యాహతంబు
లు పుట్టించుచుఁ జంచుపుట చాచపుట షట్పితాపుత్రి సంపద్వేష్టకోద్ఘట్టి
కాదితాళంబుల ఘంటారవ శంకరాభరణాది గ్రామంబు లనురాగరాగాం
గభాషాంగక్రియాంగోపాంగాది దేశిరాగంబులను సంఘటించి దత్తిలకో
హళభరతమతంగనందికేశ్వరాది మతానుసారంబున వివిధప్రబంధంబుల
నిర్మించి వానికి బహువిధస్థానమండలచారీకరణాంగహార రేచకదళనవర్తనా
దిశిరోభావచతుర్వ్యాప్తచాలనంబులు మెఱయ దేశిమార్గలాస్యతాండవంబు
లుపరిఢవించుచు నిట్లు దానతూర్యంబున ననుసంధించుచుఁ గొంతదడవవ్విరూపా
క్షునిఁ జాక్షుషంబైన యోగంబునం జింతించుచుండె నయ్యవసరంబున॥
సీ॥ ఘ్రాణంబు నీచమై కన్నులు వెల్లనై యుదరంబు వీఁపుతో నొత్తగిల్లఁ। జేదోయి
గుజ్జమై చెవులు విల్వంకలై ప్రాసకొమ్ములు ముల్లుఁబోయినట్టి। వక్త్రంబు గుం
తయై వర్ష్మంబు పరుసనై తెరనోరి దేవుఁడు లేఁగెసాఁగ। శీర్షంబు వలుదయై శిర
జ్జలోఁతులై ముష్కద్వయీశిశ్నములు గృశించి। యస్థిచర్మావశేషావయ
వములందు। జుబురుకొన్న తనూరుహస్తోమములను। బోలసుకంపున భీభత్సవా
డమఁ జేయఁ। గట్టెదురవచ్చి నిలచె రాక్షసుఁడొకండు॥ వ॥ ఇట్లు బహిరంగణం
బున రాక్షసుం జూచి వాల్మీకి పంచాక్షరాఘోర పాశుపతమంత్రాభ్యాసనావ
శంబునం బుట్టిన దిట్టతనంబునం దరలక నిల్చి యెవ్వఁడ వెచటనుండి వచ్చితి వె
చ్చోటికేఁగెదవు దృష్టిపథంబున నిలచిన పిశాచభూతభేతాళకూశ్మాండ ప్రే
తసంఘంబులలో నొక్కరుండవు గావలయు మేము దపస్వులము శివనామజా
పకులము మంత్రస్థులము భస్మోద్ధూళనచర్మధరులము రుద్రాక్షమాలికార
క్షో వజ్రపంజరమధ్యస్థితులము మముఁ బోఁట్లనీవు వెఱపింపం బని లేదు చేర
రాక యుటయుండుమనినం గృతాంజలియై యబ్భూతం బమ్మహీసురున కిట్లని
యె॥ గీ॥ ధాత్రి గోదావరీసింధుతటమునందుఁ। బ్రథితమైన ప్రతిష్ఠాన పట్టణ
మున। నగ్రజన్ముఁడ దుష్టపరిగ్రహముల। కారణంబున బ్రహ్మరాక్షసుఁడనై
తి॥ గీ॥ ఎండ నెండఁ దిమంచు ననివము గొంటి। వానఁ దడిసి తిసీతున వడఁకు చుంటి।

గాలిదూలితిని నశనంబుగాననైతి । దప్పిగుందితిదస్సిదట్టంబునైతి॥ వ॥ ఇవ్వి
ధంబునఁ బెద్దకాలంబు గలిపపిదప యాచారవిరహితుండనై యొక్కపురుషునా
శ్రయించువాఁడనై నిరాహారంబునఁ జరించుచునొక్కనాఁడు॥ సీ॥ మాటలాడు
చుఁ మూత్రమలములుత్సర్జించుచుమిహిరోదయంబున మేలుకొనఁడు। సంధ్యవా
ర్చఁడుమంత్రజపసంయుతంబుగవిడిక చ్చత్తోనుండువిడువ డెపుడు । బ్రహ్మసూ
త్రముధరింపఁగసిగ్గునహియించుఁ జద్దియోగిరమునిచ్చలుభుజించు । ఋతు
వేళనపరిగ్రహింపఁడునిజభార్యనన్యకళత్రంబునభిలషించు । నెవ్వఁడవ్విప్ర
దాయాదుఁడేగుదెంచె । మార్గవశమునభాగ్యసామగ్రికలిమి। నాశ్రయించితి
నతనిమధ్యాహ్నవేళఁ। బ్రాంతదేశంబునందొక్కరావిసుండి॥ వ॥ అతండిప్పుడ
ర్ధాగ్జనంబునకునికాశికాపురంబుకేగుదెంచెఁ పుణ్యక్షేత్రప్రభావంబునసం
బహూభూతుండనై బహిర్భాగంబుననయున్నవాఁడనింకనేమిసేయుదు నాధా
రభూతంబైనయుత్తవింగోలువోయితి నెచ్చోటనుండియేనియు నేతెంచి కాశి
కారక్షకులునన్ను బాధపెట్టుదురోయని భీతియయ్యెడు నిన్ను శరణంబువేఁడె
దమహాత్మా రక్షింపవేయనినం గృపావశంవదుండై యవ్వాల్మీకి కతనిఫాలం
బులోని విభూతిహస్తంబునధరించిడగ్గరంజని పంచాక్షరీమంత్రంబునభిమం
త్రించి లలాటంబునరక్షాతిలకంబులిఖించి కాశీనగరంబుప్రవేశింపుము మద్వి
భూతిధారణమహిమంబుననిన్ను భైరవాదులుభర్జింపనోడుదురు గపర్దీశ్వర
సేవదర్శింపు మద్దేవుండునీకునరిష్టనిరసనంబును నిష్టావాప్తియుం జేయునని
న మహాప్రసాదంబనియుతండట్లసేసిముక్తుండయ్యె నిదికపర్దీశ్వరమాహా
త్మ్యంబు॥ క॥ అందఱుపారిషదులునీ । చందంబునశంభులింగసంస్థాపనమా।
నందవనీనగరంబున । యందొనరించిరియతిప్రయత్నంబులతోఁ॥ గీ॥ కలశ
సంభవవిశ్వేశకులగృహంబు । కటకసాధారణంబెళ్ళికాశినగర। ముందు రేఖా
పతింసుమోహింపఁజేయుఁ। జాలునటదానిమహిమగోచరమెపొగడ॥ ఉ॥ కీట
పతంగసర్పపశుకీశమృగాదిసమస్తజంతుసం । ఘాటముఖండనిద్రకయికాశి
కిఁగన్నులుమోడ్చునంతలోఁ। గైటభజిద్విరించిబలఘస్మరముఖ్యసమస్తదేవ
తా । కోటికిరీటకూటములఁగూర్చునమస్కరణార్హణాంజలుల్॥ క॥ ఏనా
టనుండివచ్చియు । మానవులేరొక్కండ్రు దివుటమైత్రావరుణా । యానంద
కాననంబున । నానాకైవల్యశోభనములకుఫలముల్॥ గీ॥ మరణమానంద
వనములో మంగళంబు । భూతికాశీపురంబులోభూషణంబు । గౌరియవి
ముక్తమునుఁబొందుఁ గుంభజన్మ । పరమనిర్వాణజనులకుఁ బట్టుచేల॥
వ॥ కుంభసంభవదశాశ్వమేధతీర్థంబున దశహరాఖ్యతీర్థ దశాశ్వమేధశ్వం

దర్శించి మానవుండు దశజన్మార్జితంబులైన పాపంబుల దహించు శంఖకర్ణేశ్వరు
శశాంకకళాలంకారు మహాకర్ణేశ్వరు దృక్కర్ణకుండలు ఘంటాకర్ణేశ్వరు
ముక్కంటి మహాకాళేశ్వరుఁ గాళగళు సోమనందీశ్వరు నందివాహను
నందిషేణేశ్వరుఁ గందర్పదమనుఁ గాళపింగళేశ్వరు గంగామౌళిఁ గుక్కుటేశ్వ
రు లలాటాక్షుఁ గుండోదరేశ్వరుఁ బాండురాంగు మయూరేశ్వరు నారాయ
ణప్రియు బాణేశ్వరుఁ బినాకపాణిఁ దిలకర్ణేశ్వరుఁ జతుర్నిగమమౌళిరత్నంబు
స్థూలకర్ణేశ్వరు గరుడాపూర్ణహృదయు ద్రుమిచండేశ్వరు సంధ్యాతాండవ
ప్రియుఁ బ్రభామయేశ్వరుఁ ద్రిభువనాధిపతి శుకేశేశ్వరు నాకాళి కేశుం గొలిచి మ
ర్త్యుండు గార్యార్థంబు నొందుఁ గపర్దికోదగ్భాగంబునం బింగళాక్షేశ్వరు నవిము
క్తేశ్వరునకుఁ బశ్చాద్భాగంబున వీరభద్రేశ్వరుఁ గేదారేశ్వరు దక్షిణభాగం
బునం గిరాతేశ్వరు వృద్ధకాళేశ్వరు సన్నిధిం జతుర్ముఖేశ్వరు విశ్వేశ్వర శ్రీమ
న్మహాదేవు దక్షిణంబునం బంచాక్షరేశ్వరు నంతర్గృహోత్తర ద్వారంబున
బారభూతేశ్వరుం ద్రిలోచనేశ్వరు పురోభాగంబునం ద్ర్యక్షేశ్వరు విశ్వేశ్వ
రోత్తరభాగంబున లాంగలేశ్వరు భజించు పంచజనుండు పంచమహాపాత
కంబులం భంజించు నివ్విధంబునం బ్రమథులు లింగప్రతిష్ఠలాచరించి లింగార్చ
నాపరులై వారాణశీపురంబునం బ్రతివసించుటయు ॥ క ॥ చింతించె విశ్వనా
థుం। డంతికరణమున నేయుపాయంబున నేఁ। గాంతునొకో కాశివృ। త్తాంతం
బని మందరాచలాగ్రస్థితుఁడై ॥ సీ॥ ఏమి సేయునొ యోగినీమండలంబిప్డు కాశి
కాకటకశృంగాటకముల। నానందకాననాభ్యంతరంబునయందు బిసరుహోత్పుం
జేల మసలెనొక్కొ। వారాణశీపురావాస సౌఖ్యంబుల మరిగి వాక్పతి మన్మ
మఱచెనొక్కొ । గణనాయకులు శంఖకర్ణాదుల విముక్తమునందుఁ గాపు
రంబుండిరొక్కొ । యొక్కమతమున విరందుస్థునికి మేలు । భేదమున నన్యరా
జ్యలబ్ధికిఁ జెవంగు । నాకు నాయంత వారి నన్పంగఁ గలిగెఁ। దడసి కార్యంబుఁ గొను
టహితంబు కాదె॥ గీ॥ ఊరకుండంగ నేటికి వారణాస్యుఁ । గాశికని చెదవృ
త్తాంతగతులు దెలియ। బుద్ధిమంతుండు పోకలఁ బోయినాఁడు। కూర్పవిప్పంగ
నోపు నాకొడుకు గుజ్జు॥ వ॥ అని వినాయకు రావించి బుద్ధులానతిచ్చి పంచినం బ
విఘ్నాని కాశీకానగరంబునకరిగి॥ సీ॥ గంధర్వనగరరేఖలు మేఘపదమునఁ జే
కొనుదురు వేశ్మసీమలందు। నమ్మకకోదండ ఖండము న్సంసఁపు రేయి ధూమకే
తువు జలస్వామి కాష్ఠ। గరమరిష్టములై సకలలు నిద్రలయందుఁ గాఁపున్న యుం
స్వప్నంగములఁ బులుఁగు। గంధర్వపుపతిలోకలనగ్నికణములుపుట్టి ధికొమిష్య
మునవ జిల్లు। బాష్పసలిలంబు దేవతా ప్రతిమలందుఁ। గలుగఁ జేయుఁ దుఃప్రజల

కాకస్మికంబు। వెలువుపుట్టించుసందంద విఘ్నరాజు। ప్రతిదినంబునుగాశికాపట్ట
ణమున॥ గీ॥ తానయుత్పాతములు మూడ్పుఁదరతరంబు। తానపేక్షయించు
చుండునుత్పాతశాంతి। తానహితమాచరించుమిత్రంబుపోలెఁ। దాన వెలిపిం
చుభావిదుర్దశలు చెప్పు॥ సీ॥ కలలోనఁబుట్టినకథ లెన్నియున్నియుఁబూసగ్రుచ్చి
నయట్లు భాసఁగఁజెప్పు। హస్తరేఖలు చూచియాయుష్యమును భవిష్యముఁదె
ట తెలివిగానానతిచ్చుఁ। గూఁతులిద్దఱునీకుఁగొడుకులిద్దఱునీకు ననిమోము
సూచిసత్యంబునొడువుఁ। దాతగారనువాఁడదనవారితనమొప్పు గురుసుమో
పక యుండెపరసమాడు। వ్రతమునోమించుదివసవారములు దెలుపు। ననుకలం
బైనభామినీజనుల వెడను। గుండుబొజ్జయుశిఖయునుగుఱుచపొడవు। వేశ్రీ
లిదర్భాంకురమునొప్పివిఘ్నరాజు॥ ఉ॥ ఏనిక మోముబూమియువహించిచరిం
చుచునుండుకామధు। గ్ధేనువుశుంఠిగాశినిదిజెల్లము వేల్పులగిడ్డిగానినాఁ।డీను
నె మోక్షతత్క్షణమునిచ్చునె కాంక్షితదుగ్ధధారదూ। ర్వానవపల్లవావలులు
వైచినమాత్రనభక్తకోటికిన్॥ వ॥ ఇవ్విధంబున దివ్యాంతరిక్షభౌమోత్పాతం
బులుపుట్టించుచు నానాప్రకారంబులఁజరించుచుం గాశీపట్టణంబున కవిరకా
లంబున దరిద్రంబుప్రాపింపంగలదనువార్త మోపియుంచి హితుండునుంబో
లెలోలోనబోధించి పౌరజనంబులంగొందఱం గుటుంబసహితంబుగా వేలా
ర్చియంతంబోవక యుంటఃపురంబులు మాయాబలంబునం బ్రవేశించి రాజశు
ద్ధాంతకాంతలకువిస్రంభభాజనంబై జితేంద్రియుండనుష్ఠానపరుండు శమద
మాదిగుణగరిష్ఠుండుసత్యసంధుండు నిస్పృహుండనితన్నుసర్వజనులుసంస్తుతిం
చునట్లుగాదుంఠిభట్టారకుండనునామంబున మెలంగిలీలావతియను పట్టనదేవి
ముఖంబునదివోదాసుంగాంచియుతండడిగినప్రశ్నంబులకుసదుత్తరంబులిచ్చి
మెచ్చుపడసియులేనిపురోహితులలోనొక్కరుండై వర్తించుచుండె నంతనొ
క్కనాఁడు॥ ఉ॥ వారణకాశియందు నలువంకలఁబుట్టెను దుర్నిమిత్తముల్।
పౌరులువిన్నవింపనరపాలుఁడు విస్మయమందితత్ప్రతీ। కారమునాచరించుట
కుఁగాహితచింతకునాప్తుడుంఠిభ। ట్టారకుఁబిల్వఁబంచి నికటంబుననుంచిప్రి
యంబెలర్పఁగాన్। గీ॥ చెప్పుమాడుంఠి భట్టకాశీపురమునఁ। బుట్టుచున్నవి
యుత్పాతములుదలంచుగ। గారణంబెట్టిదినికేఁగలుమమెట్లు। వాటిలెనొ ధర్మ
మేవంక బల్లిటిలెనొ॥ వ॥ అనినవతండిట్లనియె॥ గీ॥ పార్థివోత్తమయిమ్మహో
త్పాతములకు శాంతిఁగావింతుమంత్రతపోబలమున। నాకుఁజూడంగఁగాశికా
నగరివిడిచి। యుండఁదగుఁగొన్నిదినములీవొండువంక॥ శా॥ ఆత్మార్థంబుధ
నంబుధాన్యమునునాత్మార్థంబుపశ్వాదికం। బాత్మార్థంబును తాస్త్రబంధుజ

నమాత్మార్థంబు గే హాయాచ్ఛ్రియం । బాత్మార్థంబు పరిత్యజింపఁదగు రా
జ్యంబైనప్పందమై । యాత్మార్థంపృథివీంత్యజే త్తినెడు వాక్యంబ శ్రుతం బే
న్నృపా॥ వ॥ అని చెప్పి యింకనుం బెద్దలతోడ విచారించునది యేనుద్రికాల
జ్ఞుండ నేటికిఁ బదునేనిమిదియా దినంబునకు నుత్తర దేశంబుననుండి యొక్క
బ్రాహ్మణుండు రాఁగలండతండు నీకు హితోపదేశంబు సేయఁగలండు తద్వా
క్యంబులు ప్రమాణీకరించునది యని మంత్రిభట్టారకుండు నిజనివాసంబునకరిగె
నంతనక్కడ॥ క॥ అరవిందాక్షునిఁగనుఁగొని। హరుఁడును గాశీప్రవృత్తియా
రయఁబంచెం। గరివదనుండును నీవును। బరికింపుండేక కార్యపరులై యనుచున్॥
క॥ పనిపూని కాశికిం జని। వనరుహలోచనుఁడు వెడఁద వాలికకన్నుల్। తనకుఁ
గలబలము గనియెం। బనివడి తద్విభవలక్ష్మి పరికించు నెడన్॥ వ॥ గంగావరణా
సంగమంబునం బాణిచరణతలంబులు ప్రక్షాళించి యవగాహనంబు చేసినది
గారణంబుగాన తీర్థంబు పాదోదకతీర్థంబనం బరఁగెఁ గృత కాలోచితక్రియాక
లాపుండై పుండరీకాక్షుండు॥ గీ॥ త్రిపురకాంతల శీలంబులపహరింప। బుద్ధ
వేషంబు గైకొన్న పోకలాఁడు। జలజనాభుండు సుగత వేషము ధరించెఁ। గాశికా
ప్రజకుల ధర్మగతి హరింప॥ వ॥ పుణ్యకీర్తి నామంబు వహించి తన మూలభృత్యుం
డైన గరుత్మంతునకు వినయకీర్తి యని పేరు పెట్టి యతని శిష్యుంగాఁ బరిగ్రహిం
చి లక్ష్మిం బరివ్రాజకం గావించి యమ్మహాదేవికి జ్ఞానకౌముది యను నామధే
యంబు గల్పించి తానును శిష్యుండును నొక్క ముఖంబునం బురుషులం బ్రబోధిం
పను గమలయొక్కతియును నొక్క ముఖంబునం బురంధ్రీజనంబులం బ్రబో
ధింప సంకేతంబు సేసి వేఱువేఱ మార్గంబులం గాశికానగరంబు ప్రవేశించి॥
గీ॥ పటములందు నాగరలిపి ప్రస్ఫుటముగ। వరమషీతూలికారేఖ వ్రాసినట్టి।
యర్హతాగమ గ్రంథ మత్యాదరమున। సరసఁ బఠియింప బోధించు సద్గురుండు॥
గీ॥ తత్వదృష్టిననాదిసిద్ధంబు భవము। భవము పుట్టింపనడఁపంగఁ బ్రభుఁడు లేఁ
డు। దనకుఁ దానుద్భవంబొందుఁ దనకుఁ దాన। విలయమునఁ బొందు భవమిది వి
నుమకీర్తి॥ గీ॥ బ్రహ్మవిష్ణురుద్రాదుల బ్రదుకులెల్లఁ। బట్టి చూడంగ మనబోం
ట్ల బ్రతుకులట్ల। యనఘ వారి దేహంబులు నస్మదాది। దేహములఁ బోలెఁ గాలం
బుదీనఁగాన॥ క॥ భద్రగుణా యాహారము। నిద్రా భయ మైథునములు నిఖిలయు
గుతనూ। భృదాళికి సాధారణ। ముద్రలు మరి తారతమ్యముల పను లేలన్॥
సీ॥ హంసతూలికపాన్పులందు రానేలను శయనించువారికి సరియె నిద్ర। మె
ఱుఁగుఁదీఁగెలఁబోలు మెలఁత లెందఱుఁ గల్గి నప్పుడునొక్క తొయ్యలియు రతికి।
దప్పికి నీరు వంటక మాఁకలికి శేష జంతుసంతతి కాత్మతృప్తి కొలఁది। యాఁకట

మాకైటభాసురాంతకమెల్లఁ బ్రాణికోటికిఁ బ్రాణభయము సమము ॥ గాన
దనయట్లయెదిరిని తాన్పుగాన్పు। జీవులకుఁ దారతమ్యంబు చెప్పఁదగదు। సర్వ
భూతములందునుసమత మేలు। కరుణచేపట్టవలయుఁగాఁగాదు హింస॥ గీ॥ చెల
గియార్వేనుమశకంబుచీమవల్లి। యల్పమనుబుద్ధిహింస సేయంగఁదగదు। వా
నిహృదయంబులందున్న వాఁడు జీవుఁ। డాతఁడల్పుండెయితరజీవాత్మకంబె॥
వ॥ సుఖంబేస్వర్గంబు దుఃఖంబేనరకంబు శరీరత్యాగంబు మోక్షంబు॥
మ॥ అహహా వేదముదాన చెప్పెను నహింసాత్సర్వభూతానియం। చహహా
తానకథాక్రతుక్రియలఁ బశ్వాలంభము స్మెదినీ। రుహవిచ్ఛేదముచేయుఁజె
ప్పెనదియుర్ద్రోహంబు కాదో కదా। బహుభాషల్ద్రిరుగంగ నాడుటలునుం
బ్రామాణికత్వంబులే॥ వ॥ అహింసపరమధర్మంబు హింసనరకభీరువులైన న
రులుపరిత్యజించునది హింసకుండునరకంబునకు నహింసకుండుస్వర్గంబునకుంజ
ను దానంబులనేకంబులుగలుగ నీయయ్యవియు నభీతిదానంబుం బోలనేర
వుపరమపురుషులును నానాసిద్ధాంతశాస్త్రంబులాలోకించి భీతునకభయదా
నంబును వ్యాధితునకౌషధదానంబును శిశూషునకు విద్యాదానంబును నాఁ
కొన్నవారి కన్నదానంబును దానంబులలో నెల్లం బ్రశస్తదానంబులని చెప్పు
దురు మణిమంత్రౌషధి ప్రభావంబు లచింత్యంబులు ప్రయత్నంబునందద్వి
ద్యాభ్యాసంబాచరింపనదిపరిపూజ్యంబులు ద్వాదశాయతనంబులవియెయ్య
వియంటేనిఁ గర్మేంద్రియజ్ఞానేంద్రియ పంచకంబులును మనోబుద్ధులని హే
తుదృష్టాంతంబులఁబ్రమాణప్రమేయాది షోడశపదార్థవాదులగు నైయా
యికులును ద్రవ్యగుణాది షట్పదార్థవాదులగు వైశేషికులును నవ్యక్తమ
హదహంకృతి చతుర్వింశతి తత్త్వవాదులగు సాంఖ్యులును శివశక్తిసదాశివే
శ్వరవిద్యాతత్త్వప్రభృతి షట్త్రింశత్తత్త్వవాదులగు శైవుల నపలపించుచుఁ
బ్రత్యక్షానుమానోపమానార్థాపత్తి జ్ఞానంబులయందు నింద్రియార్థస
న్నికర్షోత్పన్నంబై యవ్యభిచారియు వ్యవసాయాత్మకంబునగు జ్ఞానంబు ప్ర
త్యక్షంబు ప్రత్యక్షజ్ఞానంబు సర్వజనంబులకుం దేటతెల్లంబుగావున ప్రత్య
క్షంబవలంబించి యెల్లవారినిం దనమత ధర్మంబులువిడిచి సుగతధర్మంబు చే
పట్టునట్టుగాఁ బుణ్యకీర్తి నామధేయుండగు మధుసూదనుండు వినయకీర్తి
నామధేయుండగు శిష్యుఁగరుణ్మంతు బోధింపుచుండె వేఱొక్కయెడ విజ్ఞాన
కౌముదియను పేరువహించి పరివ్రాజకా వేషధారిణియగు వివిధకౌస్యయుప
న్యాసచాతుర్యంబొప్పు మాధుర్యగుణధుర్యంబయి మధుసమయమంథరగం
ధసారగిరిగంధవాహ ప్రవాహలహరికాస్ఫాలనానందకందళిత మాకందమస్ర

ణకిసలయరసాస్వాదన కషాయకంఠ కలకంఠ కామినీకోమలకుహూయమా
నకోలాహల పంచమంబు ననుకరించు తిన్ననిమెలుంగున॥ సీ॥ బ్రహ్మమా
నందరూపంబట్టి తథ్యంబునానాత్మపరికల్పనంబుమిథ్య। ముదిమినింద్రియశ
క్తి ముఱవపోకుండంగ మైథునక్రీడ యేమఱనియుయువు। సౌఖ్యార్థియైనయా
చకునికిచ్చుటపాడిపంచభూతాంశుకప్రకృతిదనువు। యౌవనంబులుపోమె
నారావుక్రమ్మఱ నపరిక్షయమ్మలుసంచయములు। గడచినప్పుడుక్రిములొం
డెంగాకులోండె। గుక్కలొండేనియునుభుక్తిం గొనెడుదేహ। మొకండుపౌ
ర్థించియడిగిన నొసంగవలదె। తన్నునిచ్చినయదిగదాదానగుణము॥ వ॥ వావి
వర్ణంబువిచారింపవలదు వృద్ధాచారంబు విచారించిచూచిన బ్రహ్మపుత్రు
లుగదాదక్షుండునుమరీచియు మరీచినందనుండయిన కశ్యపుండు ధర్మమా
ర్గంబునందక్షునికన్యకలం బదుమువ్వుర నెట్టువివాహంబయ్యె నిదానీంతను
లుమర్త్యులల్పబుద్ధులల్పపరాక్రములుగావున నిదిగమ్య యిదియగమ్యయని
విచారంబుసేయుచున్నవారు పరమపురుషుని ముఖబాహూరుపాదంబులం
జాతుర్వర్ణ్యంబుజన్మించె నొక్కతనువునందుంబుట్టిననలువురు సోదరులౌ
దురో కారో యట్టివారికి భిన్నవర్ణత్వంబెట్లు సిద్ధించుంగావున వర్ణావర్ణ
వివేకంబువిడిచివలసినట్లు పురంధ్రీపురుషులువిహరించునదియని పెక్కుప్రకా
రంబుల విజ్ఞానకౌముది సమయశాస్త్రంబు వక్కాణింపవిని పురాంగనలు భ
ర్తృశుశ్రూషాది ధర్మంబులుజ్జగించి రయ్యవసరంబున॥ చ॥ వననిధికన్యయుం
హరియువాడలవాడలబౌద్ధధర్మముల్। జనమతముల్ నిరంతరముం జెప్పంగఁ
జెప్పంగఁగాశికాపురిఁ। దనలినధర్మముల్ విడిచి తామరసాయతలోచనాడ
నం। బును బురుషప్రతానమునుబూనెను బుద్ధజనవ్రతంబులన్॥ గీ॥ వర్ణ
ములునాశ్రమంబులువరుసఁదప్పె। వేదములునాగమంబులువిన్నఁబోయె। సౌ
రభంబులుకృష్ణపంచములుఁజెడియె। వృద్ధిఁబొందెనధర్మంబు విశ్వమునను॥
వ॥ అప్పుడుదివోదాసుండుదుంఠిభట్టారకుండు సెప్పినవిప్రుండెప్పుడు వచ్చు
నోయనిదివసంబులు లెక్కవెట్టుకొనుచుండం బదునెనిమిదవదివసంబున మ
ధ్యాహ్నకాలంబునందు సుగతివేషధారియగుమధుసూదనుండు బ్రాహ్మణ
వేషంబుదాల్చియేతెంచినముచితప్రకారంబునదివోదాసుంగాంచియాశీర్వదిం
చియతండునుపనమున్నతకనకాసనంబునంగూర్చుండె నావేళవిఘ్నేశ్వరుండు
రాజహృదయంబునందునావేశరూపంబునధివసించెవినాయకాధిష్ఠుండై భూ
పతివై రాజ్యంబువహించి కపటబ్రాహ్మణునకిట్లనియె॥ గీ॥ బడలు వడితిరాజ్య
భారంబుధరియించి। పొడమెమదిపరక్తి భూసుపర్వ। యేమిసేయువాఁడ నెక్క

డకేగుదు। నేదిదిక్కునాకునెఱుఁగఁజెప్పు॥ వ॥ తపస్సామర్థ్యంబునం బర్జన్యా
గ్న్యనిలాత్మకుండనై తిఁ బ్రజలౌరసులైన పుత్రులుంబోలెఁ బరిపాలింపంబ
డిరి దేవతలంద్రుణీకరించిన యొక్కయపరాధంబునుందక్క నాయందుంగా
నవచ్చినయపకారంబొండులేదు నాభాగ్యంబుననీవు హితోపదేశంబు సేయ
నాచార్యుండునుంబోలె నేగుదెంచితింతగాలంబు నారాజ్యంబున నకాలమర
ణంబునుజరావ్యాధిదారిద్ర్యంబులులే విప్పుడేమికారణంబుననో యవియు
నుదివ్యాంతరిక్షభౌమోత్పాతంబులు పుట్టుచున్నయవి నాకుంజూడ వేల్పుల
వేడబంబకావలయు మృత్యుంజయుండు త్రిపురవిజయంబును నారాయణుం
డు బలిధ్వంసనంబును బురందరుండు వృత్రాసురవధంబునుమాయాబలంబు
ననొనర్చిరిబలవద్విరోధంబుదురంతంబవుటయిప్పుడెఱుంగంబడియె నిన్నియు
నట్లుండనిమ్మను బదివేలేండ్లురాజ్యంబు సేసితి జరాభరాక్రాంతుండనై తి
నింద్రియంబులువికృతింబొందుచున్నయవియింక సకలకర్మనిర్మూలనక్షమంబై
నమోక్షంబపేక్షింపవలసియుండు నమ్మహాపదార్థంబు నాకేయుపాయంబు
నసిద్ధించునానతిమ్మనినవిని బ్రాహ్మణవేషధారియగు హృషీకేశుండమ్మహీ
వరునకిట్లనియె॥గీ॥ కాశికాపట్టణమునలింగప్రతిష్ఠ। యాచరింపుముకల్పింపు
హార్మ్యరేఖ।బొందితోడనశివలోకమునకునరిగె।దనఘునామాటవేదతుల్యం
బుసూవె॥గీ॥పుత్రుఁబట్టంబుగట్టుముబుద్ధిచెప్పు। మాతనికిదేవతాభక్తియుతిశ
యముగఁ। దనయసంక్రాంతసామ్రాజ్యతంత్రుడగుచు। వనమునకునేగఁగాఁ
దగువార్ధకమున॥ వ॥ అనిబుద్ధిచెప్పి బ్రాహ్మణుండక్కడికేనియుం బోయె
దివోదాసుండునునమాత్యులమండలేశ్వరులనధ్యక్షులం బురోహితులంబ్ర
తీహారులఋత్విజులగణకుల రాజపుత్రుల బ్రాహ్మణుల సూపకారులఁ జికి
త్సకులనంతఃపురజనంబులన్నురావించెఁ గుమారునమరంజయునందఱికి నప్ప
గించియతనికింబట్టాభిషేకంబుసేసి కాశికానగరంబునందుఁ దనసర్వశ్రీస
మృద్ధియువెచ్చించిమహాప్రసాదంబునిర్మించి యందు శివలింగంబుఁబ్రతిష్ఠిం
చి కింకిణీజాలమండితంబై నదివ్యవిమానం బెక్కి శరీరంబుతోడనశివలోకంబు
నకుంజనియె నాప్రాసాదంబుసర్వశ్రీసమృద్ధివినియోగనిర్మితంబుగావున భూ
పాలశ్రీయనం బ్రసిద్ధిఁగాంచె దివోదాసేశ్వరలింగంబు భాగీరథీతీరంబునభ
జించువారికి భుక్తిముక్తిప్రదాయకంబయి ప్రకాశించె నిదిదివోదాసవృ
త్తాంతం బీయుపాఖ్యానంబువిన్నను బఠించినలిఖించిన జనులకాయురారో
గ్యైశ్వర్యాభివృద్ధియగునని చెప్పి కుమారుండుకుంభసంభవునకిట్లనియె॥ చ॥ క
రివదనుండునిందిరయుఁగైటభవైరియుఁబెక్కుమాయల। నరణిపుఁగాశికా

పురమున న్వెడలఁబాపిపినాకపాణికిం । బరమసముద్యమస్ఫురణఁ బంపిరి లేఖలునర్వకార్యముల్ ॥ గరగరసయ్యెరమ్మశశిఖండశిఖామణియంచుభక్తితోన్ ॥ సీ॥ పరితోషమునఁ జతుష్షష్టిశక్తిగణంబు నామోదనృత్తంబు నభినయించె । రవులు లోలార్కకేశవఘటోత్కటాదులుపన్నిద్దఱుపప్రమోదభాజులైరి । వనజాసనుఁడు నాల్గువదనంబులనుతించె వేదార్థములభక్తివిశ్వనాథు । గణనాయకులు శంఖకర్ణఘంటాకర్ణ నందిసేనాదులానందమొందె । రఖిలమాయాప్రయోగవైయాత్యగరిమ । ఢుంఠివిఘ్నేశ్వరుండు వైకుంఠపతియుఁ । గమలవాసినియును నేకకార్యపరత । నాదివోదాసు వెడలంగనడచుటయును ॥ వ॥ అనంతరంబు విదితదివోదాసవృత్తాంతుండై యంతకమథనుండంబికయును మహాశాఖ విశాఖనైగమర్షులుర్భుదుఖిలుప్రమథులు దేవర్షులుదిక్పాలురుంగొలిచిచను దేరఁగిన్నరకింపురుషగరుడగంధర్వసిద్ధవిద్యాధరులుజయజయధ్వనులతోడంగైవారంబు సేయ నందివాహనారూఢుఁడై మందరంబుననుండి యానందకాననంబునకు విచ్చేసి యవిముక్తమంటపంబునం బేరోలగంబుండి తత్కాలసన్నిహితులయిన యోగినీభానుపద్మభవప్రమథలక్ష్మీనారాయణుల యథాప్రధానంబుగా సంభావించి ఢుంఠివిఘ్నేశ్వరు నాలింగనంబు సేసి గండస్థలంబున నఖాంకురవ్యాపారం బాచరించుచు నిట్లనియె॥ సీ॥ నీకతంబునఁగాదె లోకభీకరులైన త్రిపురదానవుల మర్దింపఁగలిగె । నీకతంబునఁగాదె కాకోలవిషవహ్ని నలవోకయును బోలెనార్పఁగలిగె । నీకతంబునఁగాదె నిరవగ్రహస్ఫూర్తి నంధకాదులగర్వమడఁపఁగలిగె । నీకతంబునఁగాదె నేఁడువారాణశీ సంగమోత్సవకేళిసంభవించె । నాత్మజుఁడవన్న మిత్రంబవన్న భటుఁడ । వన్నసచివుండవన్ననాకన్ననీవ । నిన్ను నెబ్భంగివర్ణింపనేరవచ్చుఁ । గంఠపీఠాగ్రకరిరాజ ఢుంఠిరాజ॥ వ॥ జయజయవిఘ్నేశ్వరభక్తనిర్విఘ్నకారయకవిఘ్నవిఘ్నకరసర్వగణాధీశ సర్వగుణాగ్రగణ్యగణప్రణతపదాబ్జగణాతీత సగుణసద్గుణసర్వజ్ఞసర్వేశ సర్వభూతనిదాన సర్వమాయాప్రపంచ సర్వకర్మాగ్రపూజిత సర్వమంగళ యమంగళోపశమన సిద్ధవంద్యపద సిద్ధివినాయక సర్వసిద్ధైకనిలయ సర్వబలాధార సర్వబలాశ్రయ సర్వఫలప్రదబలాకోజ్జ్వల దంతాగ్రయనంతమహిమాధారధరాధర విదారణదంతాగ్రపోత దిఙ్ముఖనాగవిభూషణ భువనంబులకభ్యుదయంబుగ వింపుము॥ గీ॥ ఆవరణరూపమునఁ గాశియహారహంబు । గావఁదగునీకుఁ బహువిధాకారకలన । ననుచు నాసతియిచ్చెఁ జందార్ధమాళి । భవుఁడు భువనాద్భుతక్రియాపాత్రిధి మెఱయ॥ వ॥ అట్లద్దేవుండవధరించుట

యు గంగాసంభేదనంబున నర్కవినాయకుండు కాశీక్షేత్రదక్షిణంబున దు
ర్గావినాయకుండు భీమచండిసమీపంబున నిరృతిభాగంబున భీమచండవినా
యకుండు పశ్చిమదిగ్భాగంబున దేహళీవినాయకుండు వాయువ్యదిగ్భాగంబున
ఢుంఠివినాయకుండు ఉత్తరదిగ్భాగంబునం బాశపాణివినాయకుండు గంగావర
ణాసంగమంబున ఖర్వవినాయకుండు యమతీర్థంబునకుఁ బశ్చిమదిగ్భాగం
బున సిద్ధవినాయకుండు వీరు బాహ్యావరణదేవతలు గంగాపశ్చిమతీరంబున
నుత్తరార్కసమీపంబున లంబోదరవినాయకుం డాపశ్చిమంబునఁ గూ
టదంతవినాయకుండు భీమచండునకుం గించిదీశానదిగ్భాగంబునఁ గాల
కంఠవినాయకుండు దేహళీవిఘ్నేశ్వరునకుం బ్రాగ్దిగ్భాగంబునం గూ
ష్మాండవినాయకుండు దంతవిఘ్నేశ్వరునకు నాగ్నేయదిగ్భాగంబున ఢుంఠివి
నాయకుండు పాశపాణివిఘ్నేశ్వరునకు దక్షిణంబున వికటవినాయకుండు
ఖర్వవిఘ్నేశ్వరునకు నిరృతిభాగంబున రాజపుత్రవినాయకుండు గంగాపశ్చి
మతీరంబున రాజపుత్ర విఘ్నేశ్వరునకవాగ్భాగంబునం బ్రణవవినాయ
కుండు వీరుద్వితీయావరణదేవతలు ఉత్తరవాహినియగు వియద్గంగాతీరంబున
లంబోదరునకుదగ్భాగంబున వక్రతుండవినాయకుండు కూటదంతునకుద
గ్భాగంబున నేకదంతవినాయకుండు కాలకంఠునకీశానదిగ్భాగంబునఁ గపిసిం
హద్విపత్రిముఖవినాయకుండు కూష్మాండునకుం బూర్వదిగ్భాగంబునం బం
చాస్యవినాయకుండు ఢుంఠి విఘ్నేశ్వరునకాగ్నేయదిగ్భాగంబున హేరం
బవినాయకుండు వికటదంతునకు సమీపంబున నాశావినాయకుండు రాజపుత్రి
పుత్రునకు నిరృతిభాగంబున వరదవినాయకుండు ప్రణవవిఘ్నేశ్వరునకు
యామ్యదిగ్భాగంబునం బిశంగిలాతీర్థంబున దేవనదీతటంబున మోదకప్రియ
వినాయకుండు వీరుతృతీయావరణదేవతలు వక్రతుండునకుదగ్భాగంబున గం
గాతీరంబున నభయవినాయకుం డేకదంతునకుం గౌబేరదిగ్భాగంబున సింహ
తుండవినాయకుండు వక్రతుండునకీశానదిగ్భాగంబునఁ గూణితవినాయకుం
డు పంచాస్యునకుం బ్రాగ్దిగ్భాగంబున క్షిప్రప్రసాదవినాయకుండు హేరం
బునకు వహ్నిదిగ్భాగంబునకుఁ జింతామణివినాయకుండు విఘ్నరాజునకవా
గ్భాగంబున దంతహస్తవినాయకుండు వరదునకుయాతుధానదిగ్భాగంబునం
బిచండిలవినాయకుండు మోదకప్రియునకు దక్షిణంబున నుద్దండముండ
వినాయకుండు వీరుచతుర్థావరణదేవతలు అభయప్రదునకుత్తరంబునగం
గాతీరంబునస్థూలదంతవినాయకుండు సింహదంతునకు దగ్దిగ్భాగంబునఁ గరిప్రి
య వినాయకుండు కూణితునకీశానదిగ్భాగంబునం జతుర్దంతవినాయకుం

దుక్షిప్రప్రసాదునకుం బూర్వదిగ్భాగంబున శ్రీతుండవినాయకుండు చింతామణి కివహ్నిదిగ్భాగంబునం జ్యేష్ఠవినాయకుండు దంతహస్తునకు దక్షిణదిగ్భాగంబు నదత్షవినాయకుండు పిచండిలునకు యామ్యదిగ్భాగంబునం గాలవినాయకుండు దండతుండునకు దక్షిణదిగ్భాగంబున నాగవినాయకుండు వీరు పంచమావరణ దేవతలుం వారణాశికి దాగ్ని యమనిర్ృతివరుణ వాయుకుబేరేశాన దిగ్భాగంబుల మణికర్ణిక విశ్వైశా వినాయక సృష్టివినాయక యత్షవినాయక గజకర్ణవినాయక చిత్రవినాయక స్థూలజంఘవినాయక మంగళవినాయకులు యమతీర్థంబున కుత్తరంబున మిత్రవినాయకుండు వీరు షష్ఠావరణదేవతలు మోదాదిపంచవినాయకులును జ్ఞానవినాయకుండును ద్వాదశవినాయకుండును మహాద్వారవినాయకుండును వీరల విముక్తక్షేత్ర సప్తమావరణ దేవత లీ యేబది యాఱుసప్తమావరణ వినాయకులు గాశీక్షేత్రంబు రక్షింతురు॥ గీ॥ ఏఁబదియు నాఱుమూర్తుల నెసక మెసఁగి। యావరణ సప్తకంబున నధివసించి। కాశికాపురి రక్షించుఁ గడల కెపుడు। గుధరకన్యక తొలుచూలు కొడుకుడుంఠి॥ వ॥ ఇట్లు గణేశ్వర పరిపాలితంబయిన పురంబునందు॥ చ॥ శుభదివసంబునన్ విమలశోభనలగ్నమునందు మేరుసన్నిభమగు హేమపీఠమున నిల్పిర మాదులు సేసలొల్కఁగాఁ। త్రిభువనరాజ్యలక్ష్మికి సతిస్థిరభక్తిరతిన్ సరోరుహా। ప్రభవుఁడుఁ గైటభాంతకుఁడుఁ బట్టముగట్టిరి ఫాలలోచనున్॥ గీ॥ హరియు వినతాసుతుండు దుగ్ధాబ్ధిసుతయు। సౌగతాదివికార వేషంబులుడిగి। యాత్మవేషంబులు వహించి రనఘ విశ్వత। వేషములు గాశియందు విశ్వేశ్వరనిలిచె॥ వ॥ తత్ప్రసంగంబునం దీర్థంబులు గలిగె నవియెయ్యవియనిన పాదోదకతీర్థంబులు గలిగె క్షీరాబ్ధితీర్థంబు గదాతీర్థంబు లక్ష్మీతీర్థంబు తార్క్ష్యతీర్థంబు నారదతీర్థంబు ప్రహ్లాదతీర్థం బంబరీషతీర్థంబు దత్తాత్రేయతీర్థంబు భృగుతీర్థంబు వామనతీర్థంబు నరనారాయణతీర్థంబు విదారణనారసింహతీర్థంబు గోపీగోవిందతీర్థంబు విశేషతీర్థంబు శంఖమాధవతీర్థంబు హయగ్రీవతీర్థంబు లివి వైష్ణవతీర్థంబులు॥ మ॥ అలఘుశ్రీనిధిఁ గాశికాపురిఁ బ్రసంగానుప్రసంగంబులం। దెలియం జెప్పితిఁ గొన్ని లింగములనుం దీర్థంబు లన్నిక్కమై। తిలమాత్రంబును నందుఁ దద్విరహితోద్దేశంబు లేకున్కి కింగల శీసంభవ పన్నిదంబు గెలువంగా వచ్చుఁ బద్మోద్భవున్॥ వ॥ అని నవినియగస్త్యుండు మహాత్మా పంచనదీతీర్థమాహాత్మ్యం బెఱిగింపవే యని సంగునూరుండు॥ సీ॥ వేదశిరుండు నా విప్రర్షి భృగువంశసంభవుండు దపంబు సలుపుచుండఁ। జైత్రోపశుచియును బాకశాసనుఁ గొల్వమానినీమణి యొట యేనిఁబోవ। నయ్యప్సరసను జూచి యమ్మునీంద్రుండు ప్రస్ఖలితేంద్రియుండయ్యెఁ

గదలవెలిఁది। కమలలోచననమస్కారంబు సేయుచు బ్రత్యవాయమునకుభ
యముఁబొంది । వెఱకుమనిపల్కి తపసియుర్వీర్యరసము । మెలఁతకుడిచేతి
లోఁబోసిగ్రమింగుమనియెఁ । దాఁబియదిగర్భమైయుప్పలితనయఁగాంచి। నంయ
మీశ్వరునకునిచ్చిచనియెదివిక॥ గీ॥ బాలమెనిమిదియేఁడుల ప్రాయమగుడు।
వెవ్వనికనిత్తునిన్నంచుబుపిపలికిన । నయ్యవిశ్వాధికుండైనయతనికిమ్ము । న
న్నునిపల్కెనోయ్యనలినవదన॥ వ॥ అనుటయునమ్మునీంద్రుండుతపోబలం
బునంగానియట్టిపతిసిద్ధింపఁడు కాశీక్షేత్రంబునఁదపంబుసేయుము బాల్యం
బునందునీకుధర్మంబుసిద్ధించెంగావున ధూతపాపయనునామంబు వహింపు
మనినమహాప్రసాదంబని యానందకాననంబునందు ఘోరంబయినతపంబా
చరించిన॥ గీ॥ బ్రహ్మప్రత్యక్షమైవచ్చిపద్మనయన । యడుగువరమన్నఁబాం
జలియగుచునింతి । పరమపావనిఁగాఁజేయుబ్రహ్మనన్ను । ధరణిఁబావనవస్తు
సంతతులలోన॥ వ॥ అనిసంగమలాసనుండు॥ గీ॥ ధరణిలోమూఁడుకోట్లుసర్థంబు
లెక్క । గలుగుపుణ్యతీర్థంబులుగమలవదన। ప్రతివసించుచురోమకూపంబు
లందు। నిపుడునిద్దేహమునసునీకీవరంబు॥ వ॥ అనివిధాతయంతర్హితుండయ్యె
నొక్కనాఁడుధర్ముండుదన్నభిలషించిపైబడంగందలంచిన నవ్విధూతపాప
చేయిా కతలంగిన। గీ॥ జముఁడుశపియించెదానిఁబ్రస్తరముగాఁగ। దరుణిశ
పియించెజముజడత్వంబుఁబొందఁ । జంద్రికాంతశిలాంబునిర్ఝరము సతియు
జడమహానిర్ఝరంబుదాజముఁడునయ్యె॥ వ॥ చంద్రకాంతశిలారూపంబుఁగై
కొనిచంద్రోదయంబున స్రవియించుచుధూతపాపపుణ్యనదియయ్యె ధర్మం
డునుధర్మనదంబనుపేరఁబుణ్యనదంబయ్యె వేదశిరుండు నదీస్వరూపిణియైన
కూఁతురుధూతపాప నదస్వరూపుఁడై నధర్మునకువివాహంబు సేసి గభస్తి
మాలిగభస్తీశ్వరుసన్నిధిమంగళాగౌరినుద్దేశించిమయూఖాదిత్యతీర్థంబునను
గ్రతపంబాచరించిన నతనికిరణంబులవలనం బ్రస్వేదంబుద్భవించి కిరణా
నదియనంబారె ధర్మనదంబునుధూతపాపనదియునుం గిరణాతరంగిణియుగం
గాయమునలుఁగూడనైదునదులు పంచనదంబనుపేరబుణ్యతీర్థంబై త్రైలో
క్యప్రసిద్ధిఁగైకొనియె నిదిపంచనదీతీర్థం బీతీర్థంబుననాప్లుతుండైన మాన
వుండు పాంచభౌతికంబయినశరీరంబుఁబావనంబుసేసి పంచమహాపాతకంబు
లంబాయుదివోదాసునుచ్చాటనంబుసేసికైటభారాతిపంచనదంబునందువి
శ్రమించె నగ్నిబిందుండను మహామునీంద్రుండొనర్చునానావిధస్తోత్రంబుల
కుంబరితుష్టిఁబొందియిష్టవరంబుగృపచేసివెండియు॥ గీ॥ అగ్నిబిందునిపేరుని
జాహ్వయంబు। గూర్చిమధుకైటభారాతికూర్మిమిగుల। బిందుమాధవుఁడను

పేరఁబరిమపడసె। నచ్యుతుఁడుభక్తపరతంత్రుఁడౌనో కాఁడో॥ వ॥ బిందుతీర్థం
బునందుండియగ్నిబిందునకు గోవిందుండానందకాననంబునందు దీర్ఘమాహా
త్మ్యకథన ప్రసంగంబున దానధర్మవ్రతంబులనేకంబులుపదేశించి కరుణావ
శంవదుండై యతనింగనుంగొని యింకనేమియడిగెదవడుగుమనుటయు॥గీ॥అ
ధికసద్భక్తిసంపదనగ్నిబిందుఁ। డచ్యుతునకునమస్కారమాచరించి। పద్మ
లోచనకాశికాపట్టణమునఁ। బ్రతివసించిననీదురూపంబులెన్ని॥ వ॥ మఱియు
భవిష్యద్రూపంబులెన్ని యానతిమ్మనినమధుసూదనుండతనికిట్లనియె॥సీ॥పా
దోదకంబునఁబ్రథమతీర్థంబుననాదికేశవుఁడనధివసింతుఁ। దద్దక్షిణమునశ్వే
తద్వీపముననేను జ్ఞానకేశవసంజ్ఞ సంశ్రయింతు । తార్క్ష్యతీర్థమునందుఁదా
ర్క్ష్యకేశవుఁడనై భూజనంబులచేతఁబూజఁగొందు। నందునారదతీర్థమాతీర్థ
మునఁగేశవాభిధానుండనై యధివసింతుఁ । గ్రమముతోడనీనాల్గుతీర్థముల
యందు।నమృతతాజ్ఞానతార్క్ష్యమహత్వములను। బ్రహ్మవిద్యోపనిషదర్థపరి
చయంబు। పంచజనులకుఁగలుగు నాప్లవనపరత॥క॥ ప్రహ్లాదకేశవునినను। నా
హ్లాదముతోడ నెవ్వఁడభ్యర్చించుం । బ్రహ్లాదతీర్థమునఁ।బ్రహ్లాదనతనికిత్తు
భవ్యశుభంబుల్॥గీ॥అంబరీషతీర్థంబుననధివసింతుఁ। గేవలంబననాదిత్యకేశ
వుఁడనఁ। బాతకధ్వాంతవిధ్వంసపాటవమునఁ। జేయుదుశుభంబుతత్తీర్థసే
వకులకు॥ వ॥ దత్తాత్రేయభృగువామననరనారాయణవిదారణ నరసింహగో
పీగోవిందలక్ష్మీనృసింహ శేషమాధవశంఖమాధవహయగ్రీవ కేశవనిర్వా
ణకేశవ త్రిభువనకేశవ జ్ఞానమాధవ శ్వేతమాధవ ప్రయాగమాధవులను
దివ్యమూర్తులుధరించి బహుప్రదేశంబులనుండుదు రీతీర్థంబులుమదీయ నా
మవ్యపదేశంబులం బ్రసిద్ధంబులై యుండు నివి మదీయతీర్థంబులు॥ చ॥
అనఘరహస్యమొక్కటి ప్రియత్నమునన్వినుపింతునీకును। జనునకుఁగాసిచె
ప్పకుముసాధుచరిత్రునకీవు నెన్నఁడుం । బెనుమసనంబునంగలవు పెక్కులు
తీర్థములన్నితీర్థముల్ ఘనమహిమంబ్రసిద్ధిమణికర్ణికఁబోలవు నిక్కమిం
తయుఁ॥రగడ॥ శ్రీమత్కాశీపుటభేదనలక్ష్మీప్రసతిమణికర్ణిక మణికర్ణిక।
యామవతీవరచూడామణికవిహారకమలదీర్ఘికమణికర్ణిక।పాదోదకపంచ
నదాదిమహాపావనతీర్థోత్తమమణికర్ణిక। వేదపురాణాగమవిద్యాపణవీథీ
మాణిక్యముమణికర్ణిక। పంచమహాపాతకతిమిరౌఘవిపాటన రవిమండలి
మణికర్ణిక।కాంచనగర్భహిరణ్యకమండలు గండూషితజలధరమణికర్ణిక
పంచాంచినకైవల్యశుభప్రచయంబులకునుఖనిమణికర్ణిక।పంచకోశీము
క్తిక్షేత్రాబ్జమధూళీపూరముమణికర్ణిక।బిందుమాధవుఁడనునాకెంతయుఁ

శేషిమకథాపాత్రిము మణికర్ణిక। మందాకిన్యంభో వేణీభర మధ్య నాభిచక్రము
మణికర్ణిక । నరనారాయణమూర్తి ధారియగు నాకవిహృతి దేశము మణిక
ర్ణిక। గరుడఖచరవిద్యాధరకిన్నరగంధర్వనిషేవితమణికర్ణిక। ఢుంఢివినాయ
కమదజలమిశ్రనకటుప్రవాహాపుష్కరమణికర్ణిక। కంఠేకాలకిరీటవిటంకగ్లా
రుచిచుంబుకితజలమణికర్ణిక। మణికర్ణికంబగుతీర్థంబున మజ్జనమాడినమాన
వోత్తముఁడు। భ్రూణహత్య మొదలైనయఘౌఘము పొడవడఁగించును నిమిష
మాత్రమునఁ। గాశీతీర్థములెన్నియున్నియును గదలివచ్చి మధ్యాహ్నకాలము
న। రాశిఁగూడి శ్రీమణికర్ణికతీర్థంబునాశ్రయించుఁ బ్రతిదినమ్మును। మధ్యాహ్న
సమాగమమున నేనును మదనధ్వంసియును౦బరమేష్ఠియు। సాధ్యసిద్ధగంధర్వా
దులతో సంసేవింతుము శ్రీమణికర్ణిక। వత్తురు మధ్యాహ్నస్నానమునకు వాసుకిశే
షాదులు భుజగేశ్వరు। లుత్తరవాహినియగు గంగానదికుత్తమభూషణమగుమ
ణికర్ణిక। నిచ్చలుఁ బ్రాతఃకాలము మణికర్ణిక మణికర్ణిక మణికర్ణిక యని। యుచ్చ
రించుమానవులహస్తములకు సిరికికాయలు మోక్షవైభవము। లోకదానము
కోటిదానసమమైయొసఁగుఫలము నరునకు మణికర్ణిక। యొకపూర్తము కో
టిపూర్తసమమైయొసఁగుఫలము నరునకు మణికర్ణిక। యొకయాగము కోటియా
గసమమైయొసఁగుఫలము నరునకు మణికర్ణిక । యొకధర్మము కోటిధర్మసమమై
యొసఁగుఫలము నరునకు మణికర్ణిక। యుదయవేళ నెవ్వఁడు మణికర్ణిక యుదకం
బునఁ గ్రుంకును మాఘంబునఁ। ద్రిదశులు నమ్మానవునకు సంపాదింతురు సేవాంజ
లులు మకుటములు। మణికర్ణిక హరిశ్చంద్రతీర్థమున మానవుఁ డెవ్వఁడు పితృతర్ప
ణములు। ప్రణిదానంబును జేయునాతనికి భద్రపరంపర లిత్తురు పితరులు। మణి
కర్ణికప్రాద తీర్థరాజతటమధ్యమున హరిశ్చంద్రేశ్వరుఁడన । గణనాథుని భజి
యించువారలకుఁ గామధేనువై యభిమతములొసఁగు। మణికర్ణికాంతరమున
గాయత్రీమంత్రంబొకమాఱుచ్చరించినను । గణకులుపదివేలమాఱ్లు గాశీ
గాయత్రి జపించినఫలమొసఁగును। నొకవంకను గంగాకేళవులను నొకవంక హ
రిశ్చంద్రమంటపిని । సకలుష మానసమణికర్ణికతీర్థావధి సీమంబులుగా నెఱుఁ
గుము। యావజ్జీవంబగ్ని హోత్రవిధి యాచరించినట్టి ఫలము గలుగుఁ। బా
వకునందుపమణికర్ణిక నొక భవ్యాహుతి వోసినమాత్రంబున । సుపమణికర్ణి
క నాజ్యతిలాహుతి హోమవిధానము మానవవర్యున। కపరిమితంబై నిరతిశ
యంబై యక్షయ్యంబగు ఫలము ఘటించును। చక్రపుష్కరిణియను నామమునఁ బ్ర
శస్తినహించినయది మణికర్ణిక। చక్రనేమిచంక్రమమునఁ దిరిగెడు సంసృతికి నివిడు
గర మణికర్ణిక। శివుఁ గాశీపతి విశ్వనాయకుని సేవింపఁ దలంపెత్తినయప్పుడు। ద్రవ

రూపంబుపరిత్యజించివనితారూపముఁదాల్చునుమణికర్ణిక।ప్రత్యక్షంబై పుణ్య
పురంధ్రీభావంబుభజించినసమయంబున।నత్యంతమనోహరహావభావాభిరామ
యగుశ్రీమణికర్ణిక। నాలుగుభుజములు వాలికకన్నులునయనాన్వితమగుఫా
లభాగమును। బాలేందుకళామధ్యంబునసితభసితంబుధరించునుమణికర్ణిక। క
టకహారకేయూరమేఖలాకంకణాదిభూషణభూషితయై।కుటిలాలకములమీఁ
దఁజిన్నిపువ్వుఁగుస్తరించునచ్చగమణికర్ణిక।బహుకల్పాంతంబులుసరిగడచిన
పంద్రెండేఁడులచిన్నప్రాయమున। జహదజహద్వ్రీడంబగుచేతస్సంపుటము
వహించునుమణికర్ణిక। యొకచేనిందీవరమాలికయును నొకచేమాదిఫలం
బుఫలంబును। ప్రకటితంబుగనుదోడయియంజలి బంధంబువహించునుమణి
కర్ణిక। పద్మసమానంబగునాననబింబముచేనొప్పెడునదిమణికర్ణిక। పద్మరా
గమాణిక్యంబులనగుపలువరుసలుగలయదిమణికర్ణిక। పడమరముఖమైననాసా
శిఖరముపైనిష్కంపంబగుచూట్కు లెసగ। నుదురాజకళాభరణునుల్లమున
నుద్వీక్షించును శ్రీమణికర్ణిక। కన్నియగేదఁగి పూరేకుఁగబరికాభారమునం
దురుమణికర్ణిక। చిన్నిపూఁపచన్నులవలిపెపుకంచెల ధరియించునుశ్రీమణిక
ర్ణిక। మణికర్ణికచింతామాణిక్యముమణికర్ణికబృందారకధేనువు।మణికర్ణికకల్ప
ద్రుమవాపికమణికర్ణికసిద్ధరసస్యందము। శ్రీమణికర్ణికయణిమాదిమహాసిద్ధి
కారణముసేవకకోటికి। శ్రీమణికర్ణికవగ్నిబిందుముని సేవింపుముపుణ్యాత్ముఁడ
వయ్యెదు॥ వ॥ మణికర్ణికాతీర్థంబునకవాగ్భాగంబునం బాశుపతతీర్థంబందుఁబ
శుపతీశ్వరుండు లింగరూపధరుండై పశుపాశమోక్షంబుసేయుఁ బాశుపతతీ
ర్థంబునకుంబురోభాగంబున రుద్రావాసతీర్థంబాతీర్థంబునకు రుద్రేశ్వరుండ
ధిదేవతరుద్రావాసతీర్థంబునకుయామ్యదిగ్భాగంబున విశ్వతీర్థంబందు విశ్వనా
థుండు విశ్వాభిధానయగు గౌరితోఁగూడి విశ్వపూజ్యుండై యుండు విశ్వతీ
ర్థంబునకుసంగడిమోక్షతీర్థంబు మోక్షేశ్వరునకుసమీపంబున నవిముక్తేశ్వ
రుండవిముక్తేశ్వరునకుసమీపంబునఁ దారకతీర్థంబందుఁదారకేశ్వరుండు సం
సారతారకుండధివసించుఁ దారకతీర్థంబునకుసమీపంబునస్కందతీర్థంబుస్కం
దతీర్థంబునకు నవ్వలఢుంఢితీర్థంబు ఢుంఢితీర్థంబునకుసమీపంబున భవానీశంక
రతీర్థంబు॥ సీ॥ మణికర్ణికాతీర్థమధ్యవీథికిసాగిశ్రీపాశుపతతీర్థసీమగడచి। శ్రీ
రుద్రతీర్థపశ్చిమభాగమునసేరి విశ్వతీర్థంబువెన్వెంటమెలఁగి। మోక్షేశ్వరస్థా
నమూర్ధవర్త్మముదాఁటి తారకబ్రహ్మతీర్థంబుగడచి। బాహులేయక్షేత్రప
దమునుల్లంఘించిడుంఠిరాట్తీర్థోపకంఠమొరసి।భవతిభిక్షాంప్రదేహియన్నపలు
కుపలికి। వటువుసాఁచినకాశికాపదమునందు। నాఁకొనినవారికిడుసుధాహారభి

ష। కాటిక౦కణములుఘల్లుఘల్లుమన౯గ। మ॥ నియమంబొప్పఁగఁగాశికాపురి
భవానీశంకరుల్ విష్టపత్రయముంగాతురు తల్లిదండ్రులగుచు న్దాక్షిణ్యమొ
ప్పఁగ౯బ। త్వయమేతద్విషయంబునం దెలియఁగా దాయపుమధ్యాహ్నమ।
తుయభిక్షాన్నము వెట్టుచుందురుబుభుక్షాక్షీణమర్త్యాళికి౯॥ గీ॥ గృహము
వారాణశీసీమగృహిణిగౌరి। విశ్వనాథుండుగృహమేధిశాశ్వతుండు। పరమ
కారుణ్యనిధులుదంపతులుఁదారు। మునికిసప్పుడుసిద్ధించుమోక్షభిక్ష॥ వ॥ భ
వానీతీర్థంబునకుసమీపంబునజ్ఞానతీర్థంబు జ్ఞానవాపీసమీపంబున జ్ఞానేశ్వరు
సేవించినవరుండు జ్ఞానవంతుండగుజ్ఞానతీర్థసమీపంబున శైలాదితీర్థంబు శై
లాదితీర్థసమీపంబున నందితీర్థంబు నందితీర్థంబున కవాగ్భాగంబున విష్ణుతీర్థం
బందేను సన్నిహితుండనైయుండుదు నాతీర్థంబునకవాగ్భాగంబునం బితామ
హతీర్థంబు పితామహతీర్థసమీపంబున నాభితీర్థంబు నాభితీర్థసమీపంబునబ్ర
హ్మనాదతీర్థంబు స్వర్గద్వారసన్నిధి భాగీరథీతీర్థంబు తద్దక్షిణంబున ఖరతీర్థం
బాతీర్థదక్షిణంబున మార్కండేయతీర్థంబు మార్కండేయతీర్థసమీపంబున
వసిష్ఠతీర్థంబు వసిష్ఠతీర్థసమీపంబున నరుంధతీతీర్థంబు వసిష్ఠతీర్థంబునకు యా
మ్యదిగ్భాగంబున నర్మదాతీర్థంబు తత్సమీపంబునం ద్రిసంధ్యతీర్థంబు తత్స
మీపంబున యోగినీతీర్థంబు తత్సమీపంబుననగస్త్యతీర్థంబు తత్సమీపంబు
న గంగాకేశవతీర్థంబు తత్సమీపంబున వైకుంఠమాధవతీర్థంబు తత్సమీపం
బున వీరమాధవతీర్థంబు తత్సమీపంబునఁ గాలమాధవతీర్థంబు తత్సమీపం
బున నిర్వాణమాధవతీర్థంబుతత్సమీపంబునమహాబలనరసింహతీర్థంబు తత్స
మీపంబునజ్వాలాజాలనరసింహతీర్థంబుతత్సమీపంబునఁగోలాహలనరసింహ
తీర్థంబుతత్సమీపంబునమహాభయనరసింహతీర్థంబు తత్సమీపంబుననత్యుగ్ర
నరసింహతీర్థంబుతత్సమీపంబునవికటనరసింహతీర్థంబు తత్సమీపంబుననం
తవామనతీర్థంబు తత్సమీపంబునదధివామనతీర్థంబుతత్సమీపంబునఁదామ్ర
వారాహతీర్థంబు॥ సీ॥ వారాశిరంబులో వటపత్రశయనుఁడై యబ్జనాభులుమూ
ఱునైదుపదులు। తరిగొండకమఠాభీంద్రచ్ఛచోఁగుఁదురైనముమకశచ్ఛప
ములుమూఁడుపదులు। సోమకాసురుఁజంపి శ్రుతులుదెచ్చి విధాతకర్పించునట్టి
మత్స్యములిరువది। ధర్మగోపాలవేషమున వ్రేపల్లెలో విహరించు కృష్ణు
లు వేలసంఖ్య। పరశురాములుముప్పఁద్రుభానుకులులు। రాఘవేశ్వరులకో
త్రైరంబుశరిము। విష్ణురూపుఁడనొకఁడ నేవినుమునీంద్ర। కాశికాపట్టణంబైదు
క్రోశములను॥ గీ॥ శంఖపద్మగదాఖడ్గసంయుతుండు। ననఘమధుసూదనా
హ్వయుండనైననన్నుఁ।గమలమునుశంఖమునుజక్రగదలుదాల్చి। నట్టినన్నునం

కర్షణుండండ్రుబుధులు॥ గీ॥ శంఖకౌమోదకీచక్రజలజపాణి । నైననన్నుదా
మోదరుండండ్రుబుధులు । శంఖచక్రాంబురుహగదాసహితునన్ను । వామ
నుండందురాగమవ్యాప్తమతులు॥ గీ॥ పాంచజన్యంబుగదయునుజంకజంబు।
చక్రమునుదాల్చి ప్రద్యుమ్న సంజ్ఞఁదాల్తు । శంఖఖడ్గగదాంభోజసహితున
న్ను। విష్ణుఁడందురువిజ్ఞానవిమలహృదయ॥ గీ॥ శంఖచక్రగదాఖడ్గ సహితున
న్ను । మాధవుండండ్రుమేధాసమగ్రమతులు । శంఖగదలునుజక్రాంబుజము
లుదాల్చు। నన్నుఁబురుషోత్తముండండ్రునున్నదురిత॥ గీ॥ శంఖకౌమోదకీ
పద్మచక్రధరుని। ననుజనార్దనుఁడనుచుఁజెప్పనుబుధాలి। శంఖచక్రగదాంభో
జసహితునన్ను। విశ్వవినుతచరిత్రగోవిందుఁడండ్రు॥ గీ॥ శంఖపద్మగదాచక్ర
సహితుఁడైన। యట్టినన్నుఁద్రివిక్రముఁడండ్రుబుధులు। శంఖమునునంబుజం
బునుజక్రగదలు। దాల్చునన్నుఁజెప్పజగముశ్రీధరునిఁగాఁగ॥ వ॥ శంఖగదాప
ద్మంబులహృషీకేశుండును శంఖచక్రపద్మగదల నృసింహుండును శంఖగదా
పద్మరథాంగంబులనచ్యుతుండును శంఖాసిగదాపద్మచక్రంబుల వాసుదేవుం
డును శంఖపద్మగదాచక్రంబులనారాయణుండును శంఖపద్మచక్రగదలం బ
ద్మనాభుండును శంఖగదాసికమలంబుల నుపేంద్రుండును శంఖచక్ర పద్మగ
దలహరియును శంఖగదాపద్మచక్రంబులఁ గృష్ణుండును బ్రకాశింతురివిమ
దీయ దివ్యమూర్తిభేదంబులని యానతిచ్చి కార్యాంతర వ్యాసంగంబున
మాధవదేవుండంతర్ధానంబుసేసె నగ్నిబిందుండునుంజరితార్థుండై బిందుమా
ధవదేవునియందు నేకీభవించె నిదిబిందుమాధవాగ్నిబిందుమాధవసంవాదం
బునితిహాసంబిదివిన్ననుంబఠించినను వ్రాసిననుమానవులకుభోగమోక్షము
లుసిద్ధించుననినం గుమారున కభివాదనంబుసేసి కుంభసంభవుం డిట్లనియె॥
సీ॥ పార్వతీనందనపాంచజన్యధరుండు విఘ్నరాజునుశ్రీయువేఱువేఱ। వివి
ధమాయోపాయ వేషభాషాదులభ్రమియించి కాశికాపట్టణమున।నుఱకది
వోదాసునుచ్చాటనముసేసి యామేలువార్తమంథాద్రినున్న । హరునకుఁ
జెప్పిపంపిరిహరుఁడునువచ్చెఁ గాశికానగరికిఁగరమువేడ్క । వచ్చిపేరోలగం
బుండి వరుసతోడ। యోగినులభానువిధిఁబ్రమథోత్కరంబు । హరినిలక్ష్మివి
నాయకునాదరించి । భువనసామ్రాజ్యపట్టంబుపూనెనంట॥ వ॥ సామాన్యం
బున సంక్షేపరూపంబుగావినుటంజేసి తద్వృత్తాంతశ్రవణంబునందు నాకుం
దృప్తిచాలకున్నయదివిశేషంబుగావిస్తరించియానతిమ్ము కాశీమాహాత్మ్యం
బునకుండక్కినవృత్తాంతంబులానుషంగికంబులు ఈవృత్తాంతంబధికారంబు
గదాయనుటయు నత్యంత సంతుష్టాంతరంగుండై గాంగేయుండు కుంభసం

భవునకిట్లనియె॥ ఉ॥ కైటభదైత్యవైరియధికంబుగ సేర్పునమన్ను జేనికు
చ్చాటనమాచరించి తనబంటుఖగేంద్రునిఁబంచెఁగ్రమ్మఱన్ । హాటకలేఖదా
నునుగజాస్యుఁడులక్ష్మియుఁజేసినట్టికై । లాటమునన్ ఘటిల్లెసకలార్థము దే
వర యాజ్ఞ పెంపునన్॥ వ॥ అగుచుసంతోషపద్ధతిలిఖించి గరుత్మంతునిచేతికి
చ్చిపంచినసతిత్వరితగతిలవణేక్షుసురాసముద్రంబులుదాఁటికుశద్వీపంబుడాసి॥
శా॥ తథ్యానవ్యవధానమానసునిమంథత్క్ష్మాధరాధిత్యకా । మధ్యాధ్యాసితుశం
భుడగ్గర గరుత్మంతుండు గార్యార్థసం । సిద్ధిత్వంబునుదీర్ఘపక్షయుగవిక్షేప
ప్రభేదంబుచే । నధ్యాహార్యముగానిశంకుశమహాహంకారధీరోద్ధతిన్॥ వ॥ డాసి
యంతంతసాష్టాంగదండప్రణామంబులాచరించి చేరవచ్చినందికేశ్వరునిచేతికి
సందేశపత్రికయిచ్చి సమీపంబున బద్ధాంజలియైయుండె విదితదివోదాసవృ
త్తాంతుండై మృత్యుంజయుండు గాశీపట్టణంబునకుం బయనం బగుటయు॥
ఉ॥ ఎత్తిరిటెక్కెయంబులును నెల్లులుసంబరవీధిదీటుకో । నొత్తిరిశంఖకాహ
ళము లూఁదిరిశృంగకవంశకాండముల్ । మొత్తిరిదుందుభుల్ ప్రమథముఖ్యు
లుహాప్పిఁచితచిత్తవృత్తులై । యత్తరిఁగాశికానగరి యానమహోత్సవజృం
భణంబునన్॥ వ॥ అప్పుడునందికేశ్వరుండు॥ సీ॥ ఏనుంగులెనిమిదివృషభంబు
లెనిమిదితురగంబు లెనిమిదిహరులెనిమిది । గంగాతరంగిణీకాళిందికీపలుసా
యంబు రేపుసుజక్రయుగము । ధవళాతపత్రంబు తారకావర్తంబురజితంబు
మొలలతారాగణంబు । ప్రణవంబునికోలపాదపీఠంబుగాయత్రివేదంబుస
ర్వాంగరక్షు । ద్వారసంరక్షకులుదీప్రధామవిధులు । మార్గదర్శకమామ్నాయ
మండలంబు । గాసమున్నతమగుకేతాంగంబుపన్ని । ప్రాంగణంబుననిల్పెశివా
దనుఁడు॥ వ॥ విశ్వేశ్వరుండునుగ్రైసేసి భవానీసహితుండై యద్దివ్యస్యందనం
బెక్కె ముప్పదిమూఁడుకోట్లదేవతలును గోట్యయుతద్వయ ప్రమథగణంబు
లును నవకోటిదుర్గలును గోటిభైరవులును గోటికుమారు లేడుకోట్లవినాయ
కులు షడశీతిసహస్రమునులు నందఅగృహమేధులును మూఁడుకోట్లుపాతా
ళతలభుజంగంబులును రెండుకోట్లు దైత్యదానవులు నష్టాయుతగంధర్వులు
నుగోట్యర్ధలక్షరాక్షసులును బదివేవురువిద్యాధరులును నఱువదివేలప్సరస
లు నెనిమిదిలక్షలుగోమాతలును షణ్ణవత్యయుత సుపర్వులును సప్తసాగరం
బులును నెనిమిదివేలుకిన్నరులును మున్నూఱువనస్పతులును గొలిచిరావా
యువేగంబున ముహూర్తమాత్రంబుననభోమార్గంబునంజని కాశీప్రవేశిం
చె నప్పుడుగోమాతలుదుగ్ధవర్షంబులుగురిసిరి జేగివప్పుండనుమహామునీశ్వ
రుండు వేదార్థసారంబులగు కైవారంబులం బరమేశ్వరుంబ్రస్తుతించె నప్పర

మహేశ్వరుండు జ్యేష్ఠమాసంబున శుక్లపక్షంబునఁ జతుర్దశినాఁడు ప్రవేశించెన
ది కారణంబుగా జ్యేష్ఠస్థానంబను తీర్థంబును జైగీషవ్యస్తోత్రంబు గారణంబుగా
జైగీషవ్యతీర్థంబును గోమాతృ దుగ్ధవర్షంబు గారణంబుగా క్షీరోదతీర్థంబు
నుం గలిగె నిట్లు కాశీపట్టణంబు ప్రవేశించి॥ గీ॥ బ్రహ్మవిష్ణువిహిత పట్టాభిషి
క్తుఁడై। జగములెల్లఁ గొల్వఁ జంద్రధరుఁడు। గౌరితోడఁ గూడఁ బేరోలగంబు
న్న। వేళ వచ్చెఁ గాశి విప్రగణము॥ అందు॥ సీ॥ సంస్తుతించిరి బహ్వృచప్రపంచం
బుల నొకకొంద ఱసితకంఠోపకంఠు। నుచ్చైస్స్వనంబున నొకకొంద ఱనుతిం
చిరార్యాకళత్రు నధ్వర్యశాఖ। శివునిఁ బ్రశంస సేసిరి యొకకొంద ఱుసద్భక్తిమై
సప్తసామములను। సర్వజ్ఞుఁ బొగడిరథర్వవేదంబున నొక్కకొంద ఱు ప్రసం
గోచితముగఁ। గాశికాతీర్థవాసులు గర్మకరుల। భూతిరుద్రాక్షధారులఁ బుణ్య
నిధుల। నందఱినిఁ జూచి కరుణాసమగ్రబుద్ధి। నిట్టులని యానతిచ్చె విశ్వేశ్వరుం
డు॥ గీ॥ సేమమే విప్రులార యనామయంబె। పరమమాహేశ్వరాచారనిరతు
లార। కుశలమే కాశికాతీర్థకోటి దివ్య। లింగపూజైకతానాంతరంగులార॥
వ॥ అనిన విని మందాకినీతీర్థంబు హయతీర్థంబు మత్స్యోదరీతీర్థంబు కపాల
మోక్షతీర్థంబు నాదిగాఁగల తీర్థంబులనుండి యేతెంచిన బ్రాహ్మణోత్త
ములు మృత్యుంజయునకు నమస్కరించి యిట్లని విన్నవించిరి॥ గీ॥ అసియువ
రుణయుఁ గూడిన యంతనుండి। సంమేశ్వరతీర్థదేశంబు దాఁక। గగనగంగా
తటంబునఁ గదలకుండు। తీర్థవాసుల మమృతదీధితికిరీటి॥ గీ॥ పదియునేఁబది
వేలును బంచశతియు। నెనుబదియునైదు సంఖ్యలయిండ్లవార। మాశ్రితులు
గాశికాపురి యస్మదీయు। లీశ పల్లేరు దుడిచి పాడెక్కినారు॥ వ॥ అనియనంతరం
బయాశీర్వదించి యార్ద్రాక్షతంబులు చల్లి మంగళసూక్తంబుల సంస్తుతించి
బ్రాహ్మణులు ప్రబద్ధకరసంపుటులై దేవా భవదీయకటాక్షవిక్షేపసంభూత
ప్రభూతానుకంపాసంపత్తి గలుగ మాకు సేమంబనామయంబు గుశలం బేమి
భ్రాంతి యుదియునుంగాక॥ క॥ వృషభగమన భవదాశ్రీ। విషవృషితనిషేకజని
తవిషమదశాదు। ర్విష హేబాహ్వదోషసర్వం। కషములు కాశీసవిూపగంగా
మృతముల్॥ వ॥ అనిన విని పినాకిదానునుం గాశీనామాక్షరద్వయంబు గరా
మృతంబనియును గాశీక్షేత్రధూళిత్రసరేణువులు సర్వాంగరక్షలనియును
గమనాసనస్వప్న జాగరణంబులం గాశీనామస్మరణంబు పాపంబులఁ బాపం
జాలుననియును బ్రహ్మాండగోళంబునం గలతీర్థజాలంబులెల్లను గాశీక్షేత్రంబు
నం బంచక్రోశంబున వసించియుండుననియును గాశి నిర్వాణమాణిక్యఖనియని
యును గాశి మోక్షలక్ష్మీనివాసకుశేశయంబనియును గాశి సంసారబీజాంకు

రమరుభూమియందునియమునుంగొనియాడి తానునమ్మహీసురులు గొంతతడవభీష్ట
గోష్ఠీవినోదంబులం బ్రొద్దుపుచ్చి వారుచూడంజూడ నంతర్హితుండై దివ్య
భవనాంతరంబైన జ్యోతిర్లింగంబునం దంతర్భవించె బ్రాహ్మణులు నిజని
వాసంబులకుం జని రిది వృషభధ్వజావిర్భావంబను నుపాఖ్యానంబు భోగమోక్ష
ప్రదాయకంబు॥ ఉ॥ పంచసహస్రలింగములు భాసురమూర్తులు జ్యేష్ఠనాథతీ
ర్థాంచలభూమియందుం బ్రణతాఖిలనిర్జరముఖ్యమండలీ। కాంచనమౌళిరత్న
కలికారుచిజాలపిశంగితాంఘ్రులు। భవ్యాంచితభోగమోక్షవిభవాకరముల్గలశీ
తనూభవా॥ వ॥ అవిమెయ్య్వియనినవాదిత్యలింగంబు వరదానేశ్వరలింగంబు
ఘూండవేశ్వరలింగంబు మంకిణేశ్వరలింగంబు జానుకేశ్వరలింగంబు సుమంతే
శ్వరలింగంబు భారద్వాజేశ్వరలింగంబు వాజపేయేశ్వరలింగం బగ్నివర్ణేశ్వ
రలింగంబు ధ్రువేశ్వరలింగంబు మత్స్యేశ్వరలింగంబు కుక్కుటేశ్వరలింగం
బు వర్ణాదేశ్వరలింగంబు సత్తుప్రస్తేశ్వరలింగంబు మందాకేశ్వర లింగంబు
బాభ్రవేశ్వర లింగంబు వచనేశ్వరలింగంబు కళిందేశ్వరలింగంబు క్రోధనే
శ్వరలింగంబు శంఖుకేశ్వరలింగంబు కుండలేశ్వరలింగంబు కంఠేశ్వరలింగం
బు తుంబురునారదేశ్వర లింగంబు మతంగేశ్వర మాగధేశ్వర జతుకర్ణేశ్వర
జంబుకేశ్వర చారుధీశ్వర జలేశ్వర కాళేశ్వర గాలవేశ్వర మహాలింగంబు లాది
గాఁగల మహాలింగంబులు వెండియు॥ సీ॥ ఒక్కనాఁడు భవానియును సుపో
కకుఁ బైఁడిజలపోసనము కసీసంపుపట్టు। బంతిగుట్టిమభూమిఁ బాణిపల్లవమున
నాస్ఫాలనము చేయుచాడుచుండ। నప్పుడంబరవీథిసురలిద్దఱుగందుక క్రీడన
లుపునగ్గాంచిఁ జూచి। ప్రమథవేషముదాల్చి పట్టంగవచ్చిరి కనుసన్న చేసిశంక
రుఁడుచూపఁ। బర్వతాత్మజయుక్కూట పారిషదులఁ। జంపెనచ్చెండునసయు
రప్పలులవైచి। కపటదైత్యులఁబరిమార్చెఁ గందుకంబు। కందుకేశ్వరుఁడనఁ
గాశిఁగాంచె మహిమ॥ వ॥ ఇది కందుకేశ్వరసంభవంబు॥ సీ॥ దండభూతా
ఖ్యతీర్థమునందు దుందుభి నిర్హ్రాదుఁడనుయామినీచరుండు। ప్రహ్లాదుమామ
యపాపి దేవతలకు నహితంబుగానధ్వరాంశదాత్రు। లైనవిప్రులఁ జంపఁ బూని
కాశికివచ్చి శివరాత్రియందుఁ దక్షేత్రవాసి। యొక్కవిప్రుఁడు శశాంకోత్తం
సుఁ బూజింపఁ బులివేషముధరించి పొంచెఁగరవ। నతఁడుపూజించు వృషభాం
కుఁడదియెఱింగి। చంపెనాదైత్యునో ఆలంగఁజక్కనిజికి॥ పుండరీకంబుఁ జంపి
యఖండపరశుఁ। డుండెఁగాశి నివ్యాఘ్రేశ్వరుండనంగ॥ వ॥ వెండియు జ్యేష్ఠే
శ్వరు సమీపంబునఁ గుక్కుటేశ్వర పితామహేశ్వర గదాధరేశ్వర వాసుకే
శ్వర కపాలభైరవ మహాతుండవృషభేశ్వర సాగరేశ్వర గండేశ్వర దుందు

మాకేశ్వరకర్కోటకేశ్వర సంప్రతీకేశ్వరతుండకేశ్వర మండలేశ్వరులు ది
వ్యలింగంబుల జూచువారికి భోగమోక్షప్రదాయకంబులు॥ సీ॥ ఒకనాఁడు
మేనకయుఁ బ్రౌఢరేంద్రునిరొద్దఁ గూర్మినూజయునికిఁ దెలఁచి। పేదజీవనమమ్యో
బిడ్డకురాగుండెవాఁడవు గానవీవాయురయము। కాశినెట్లున్న శోకమలాయుతే
క్షణదర్శించి వచ్చుటతగవుగాదె। మెలనాగపుట్టిన యింటివారలుదన్ను నర
యకుపేక్షించునపుడు బెగడు। నసినబహుసంపదలతోడ నరిగియతఁడు। క్రతు
భుగీశ్వరుపురలక్ష్మి నతిశయించు। తత్పురముఁ జూచి శివుఁ జూచి లలనఁ జూచి।
తెలిసియుమ్వీటలింగప్రతిష్ఠ సేసె॥ వ॥ శైలాధిపతిప్రతిష్ఠితంబైన యాలింగం
బు శైలేశ్వరలింగంబు॥ ఉ॥ అంబికకుంచుఁ దెచ్చినమహామణిసంఘము పో
కపోసియ। య్యంబురుహాక్షి యానతినయద్రికులాగ్రణి నిల్పె రత్నలింగంబుమ
హాప్రమాణమునఁ గాశికనుద్ధతినేఁడు నింద్రచాపంబులనీనుచు న్వెలుఁగు బ్రా
హ్ణాములం దపరాహ్ణవేళలన్॥ గీ॥ చిత్తగింపుము నాడిసంసిద్ధమైన। యొక్కపు
ణ్యేతిహాసమనూనచరిత। శిశిరగిరిరాజసంప్రతిష్ఠితవిశుద్ధ। రత్నలింగేశుమహి
మవిభ్రాజితంబు॥ సీ॥ కాశికానగరంబు వేశవాటికలోనఁ గర్పూరతిలక నా
గణికయొకతె। యనమసాయకునియాఅవపుష్పబాణంబు రత్నేశునాస్థానరం
గభూమి। గుండలీవృత్తంబుగోహళాద్యాచార్యమతభేదములఁ జేసి మార్గసర
ణి। జారికాకరణాంగహారరేచకములభ్రమరికావళులనర్తనగతులను। నాడి
మెచ్చించు నెట్టిచోద్యంబొ తరుణి। మీనకేతనహరుఁ డట్లు మెచ్చుటెట్లు। తా
నుదాండవవిద్యాప్రధానగురుఁడు। లలనపార్వతిసుకుమారలాస్యజనని॥ వ॥ ఇ
ట్లు పరమేశ్వరునారాధించి యనంతరంబ యొక్కనాఁడు గర్వ్యాంతరవ్యా
సంగంబున నన్యదేశంబునకుం బోయి విధివశంబునఁ గాలధర్మంబునొంది ప్రా
గ్భవీయుంబైన యీశ్వరారాధనసుకృతంబునం జేసి గంధమాదనంబున వసు
భూతియను గంధర్వరాజునకుం బ్రభవించి రత్నావతియను పేర రూపలావ
ణ్య విభ్రమవిలాసంబులకు నావాసంబై పూర్వజన్మవాసనావశంబునఁ గాశి
కానగరంబున రత్నేశ్వరుం బ్రతిదినంబును గొలిచి నిజనివాసంబునకుం బోవు
చుండు॥ గీ॥ ఇద్దకరుణాన్వితుండు రత్నేశ్వరుండు। తన్ను ననిశంబు గొలుచు గం
ధర్వసుతకుఁ। దనకు సేవకుఁడైన పాతాళరాజు। శేషకులు రత్నచూడును జేసెఁ
బెండ్లి॥ గీ॥ దందశూకంబుకలలోనఁ దరుణిఁ గూర్చెఁ। గాంచికలలోన దందశూ
కంబునునుచు। నెట్టి వేడుక కాఁడొ రత్నేశ్వరుండు। జంపతులఁ జేయుఁ దాకను
జలముఖాంతిమె॥ క॥ లీలాకైవల్యవినో। దాలంబంబగుచు లోకయాత్రావి
ఘులం। బాలించునుబుసపోకకు। హాలాహలగళుఁడు కాలయాపనబుద్ధిన్॥

గీ॥ రత్నలింగేశు మందిరప్రాంతభూమి। రత్నచూడాఖ్యుఁడగుభోగిరాజు పేర। రత్నచూడాహ్వయంబు తీర్థంబుగలిగెఁ। గాశికాస్థానమునయందుఁ గలశజన్మ॥ వ॥ ఇంక గృత్తివాస స్తీర్థమాహాత్మ్యంబువిను మొక్కనాఁడు కాశీప్రవేశవిష్కంభంబున గంభీరకంఠ గర్జితఘోషంబున జలదంబులం జాతకవ్రాతంబును భువి శిఖండిమండలంబును నొండొండ నుల్లసిల్లంజేయుచు సముల్లసత్కదంబకుసుమకేసరవాసనాసంపాదిత మదసురాసార సౌరభ్యంబున దశదిశాభోగంబులుభుగులుకొని మూర్ధోద్ధూళనంబున బ్రహ్మాండఖండంబు దశనకులిశకోటిఁకుత్పాదించుభంగి సంగీకరించుచు సముద్దండ శుండాకాండ గండూషితోజ్ఝితంబగు విబుధనిర్ఝరిణీపాథఃపూరంబునఁ బయోధరవీథిచక్రంబు పీడ్కాలుపుచు జరణ ఘట్టనంబునం బుడమింగదిసివినంగపట కిటిజరఠకమఠభుజగపరివృఢులుగూడి గిల్లంబడఁ గఠోరచూత్కారపవనధారాభిఘాతంబు సజీమూతవ్రాతంబుచెదదరిపఱవఁ గర్ణతాళదుందుభి ధ్వానంబుల కుధరగహ్వరక్రోడంబులం బ్రతిధ్వనులం బుట్టింపనుచ్చకుంభకూటాట్టాలకంబగుట గర్వంబునకు నివాసదుర్గంబును శీకరాసారశిశిరంబగుటం గ్రోధంబునకుసీహోరధారాగృహంబును దానప్రవాహంబులకుఁ బ్రావృట్కాలంబును దర్పాంధకారంబునకుఁ గాళరాత్రిసమయంబునునైన యానంద కాననంబున నవష్టంభసంరంభ విజృంభణంబున॥ స్రగ్ధర॥ చించెంజెండాడెమట్టింజిదిమి విఱిచె గ్రొచ్చెఁ విఘట్టించెదంచెఁ। ద్రుంచెఁజక్కాడెమోదెఁ దొడసెఁగడసెనత్యుద్ధతిఁ గాశికాపూః। పంచక్రోశీధరిత్రీపరిధిఁ గరిసుర ప్రత్యనీకుండుహేలా। సంచారోదగ్రభంగిఁ జలముకొనివనీ సౌధవప్రాట్టవీథుల్॥ మఱియు॥ సీ॥ భారభూతేశ్వరప్రాకారగోపుర ప్రఘణభూములమద ద్రవముఁగురియు। ఘుషించిగండభాగముఘుష్టో ల్కాదిత్యభవనోపకంఠాంఘ్రిపంబుశాఖ। ధూత్కారమొనరించి ద్రుమిచండపతిమేను దొండంబుదుప్పర దొక్కదోఁచు। సలుపువప్రక్రీడ శంకుకర్ణేశ్వర స్థానమాణిక్యపాషాణవేదిఁ। బాఱఁబాఱఁగ వేఁటాడుప్రమథకోటి। గర్జసేయుభూతంబులుగళవళింప। మలయుఁగాశీపురంబులోమాఱులేక। యహితజయభాసురుఁడు సింధురాసురుండు॥ క॥ గజదైత్యుఁడివ్విధంబున। గజిబిజసేయంగఁ గాశికానగరమునం। బ్రజనితభయకంపమునం। బ్రబహామరపాకుపిళ్ళ భంగిందలఁకెన్॥ ఉ॥ క్రొవ్వునఁగన్నుఁగానకిటు కుంజరదైత్యుఁడు విక్రమోద్ధతిం। జివ్వకుఁజేయిసాచితనుఁజేరఁగవచ్చి సలోచనంబులన్। నవ్వుచుఁ గాశికానగర నాథుఁడు విశ్వవిభుండునై చెడా। నెవ్వడిమాతుఘానరథిగేయుకాలమనం దిగ్రిశూలమున్॥ గీ॥ అతిత్రిశూలా

యుద్ధంబులీవాహ్నింశుకోటి। భాస్వత్ప్రభాసురముగుంభపదము నాటి।రక్తధార
రలతో నయా రాక్షసేంద్రుని కలుషములుగార్చియే తెంచెఁ గ్రమ్మఱంగ॥ వ॥ అ
ప్పుడు నిర్మలాంతరంగుండై యా రాక్షసేంద్రుండు విరూపాక్షు ననేకప్రకారం
బులం బ్రస్తుతించినం బ్రసన్నుండై విశ్వేశ్వరుండు గజాసురు వరంబు వేఁడు
మనిన నాదైత్యుండు మృత్యుంజయున కిట్లనియె॥ ఉ॥ పుట్టినవారికిన్ని యజము
ల్మరణంబులు విశ్వనాథ నా। యట్టి కృతార్థుఁ డెవ్వఁడు చరాచరవిశ్వవిధాతసృ
ష్టికిం। బట్టపురాజనానతసుపర్వకిరీటతటీవిటంకసం। ఘట్టితపాదపీఠుని నుఁగం
టేఁ దుదిం గరుణాపయోనిధీ॥ గీ॥ అమరవందిత శూలాయుధమునఁ జేరి।నెం
డలు దిత్తొల్చితో లుపచ్చడము చేసి। యుత్తరాసంగముగఁ జేసియుండవలయు।
నోడిగిలి రక్తబిందువులుట్టిపడఁగ॥ ఉ॥ అంధకవైరి నాయెడ దయాగుణసంప
దగల్గె నేనినీ। స్కంధమునొందనాయొడలిచర్మము పాయక యుండుఁగాక దు।
ర్గంధము లేక కర్కశముగాక చెలుంగక వెండికొండపైఁ। గంధరఖండమున్న
యొసకంబున నీవర మేవగించెదన్॥ వ॥ అనిసింధురాసురు గోరినవరంబిచ్చి
యంధకవైరి కృత్తివాసుండయ్యె నది కారణంబుగాన తీర్థంబు కృత్తివాసస్తీ
ర్థంబన విషమభవకలుషవిషనిషేకభంగజాంఘులికంబైన గగనగంగాతీరంబు
నం బరమఖ్యాతిగైకొనియె ననంతరతీర్థంబులాకర్ణింపుము॥ మ॥ కలశీసం
భవయద్భుతంబొక్కటి యాకాశంబునన్ రెండుగాఁ గులుగాకాకృతిగా నృగాఁ
గళకశ్యాకురప్రకారోద్ధతిన్। గలహంబాడి కొలంకులోఁ నఁబడి లోకంబెల్లవీ
క్షింపఁగా। గలహంసత్వము నొందెనిట్టివి సుమీ కాశీప్రభావోన్నతుల్॥
వ॥ అదికలహంసతీర్థంబు॥ గీ॥ హంసతీర్థంబు దగ్గరియున్ని దిశలఁ। బదియువేలు
సుమునుస్నాబుభవ్యచరిత। శంభుభవ్యలింగంబులు సన్మునీంద్ర। సంప్రతిష్ఠాపి
తములభీష్టప్రదములు॥ వ॥ లోమకేశ్వరలింగంబు మాలతీశ్వరలింగం బంలికే
శ్వరలింగంబు జనకేశ్వరలింగంబు శీతాంగభైరవతీర్థంబు శుష్కోదరతీర్థం
బగ్నిజిహ్వామణికుండ మహాబలలింగ శశిభూషణలింగ మహాకాళయోగదేశ్వ
రమహానాదతీర్థంబులును విమలేశ్వరలింగంబు మహాదేవలింగంబు పితా
మహేశ్వరలింగంబు స్త్రుదస్థలీతీర్థంబు చండేశ్వర నీలకంఠేశ్వర విజయేశ్వర
శ్రీకంఠేశ్వర కపర్దీశ్వర యక్షేశ్వర జయంతేశ్వర త్రిపురాంతక కుక్కుటేశ్వ
రత్ర్యంబక హరిశ్చంద్రేశ్వర చతుర్వేదేశ్వర సహస్రాక్షేశ్వర శాసేశ్వర సం
హారభైరవస్థానోగ్రభవేశ్వర డిండీశ్వర భద్రేశ్వర కాలకలశేశ్వర కామేశ్వర
లింగంబులును గపాలలోచనతీర్థంబును దీప్తేశ్వర రామేశ్వర స్వయంభూ
మహాలక్ష్మీశ్వర ధరణీవరాహేశ్వరలింగంబులును గణపతిక్షేత్రంబును మ

తోస్స్వరతీర్థంబును భూస్వవస్వర్లింగంబును హాటకేశ్వరకిరాతేశ్వరభార
భూతేశ్వరవకులేశ్వర నైరృతేశ్వర జయుడ్రియుక్యేష్ఠేశ్వర దేవేశ్వరాంకారే
శ్వర ప్రాసాదపర్వతలింగంబులివి యష్టషష్ట్యాయతనంబులు॥ సీ॥ శ్రీవిశా
లాక్షి చేశిశిరభానుకిరీటు వర్ధాంగలక్ష్మి చేనగజచేత। లలితచేఁదరుణపల్లవపా
టలాంగిచే జవరాలిచే లోకజననిచేతఁ। బూబోఁడి చేవిశ్వభుజచేత హ్రీంకా
రవనజవాటివిహారవరటచేత। శివదూతిచేతఁ బశ్చిమనాడికావీథిఁబరమయో
గులు గాంచుఫలము చేతఁ। జిత్రకంఠిక చేసిలచికుంచేత భద్రకాళిక చేదైత్య
భయదచేత। నిగళభంజన చేఁగృపానిఘ్న చేతఁ। గరిమ గైకొనె శ్రీకాశికాపు
రంబు॥ గీ॥ గుజ్జుమోష్ఠిక మాదికుబ్జామహాదేవి। భక్తలోకకీరపతగముల
కుఁ। గమలగమలనాథగౌరాబు చేపేరి। గ్రామదైవతములు గాశినగరి॥ సీ॥ ఐరా
వణము నెక్కి యశనిచేధరియించి దైవేంద్రఘంటావీథియందు మెలఁగు। విహ
రించు శృంగారవిపినవీథులయందుఁ గౌమారిశిఖిశాబకంబు నెక్కి। చంద్రశే
ఖరునాదిశక్తిమహేశ్వరియాఁబోతు నెక్కి వాహ్యాళి వెడలుఁ। జదలేటిపై క
తస్థలులవినోదించు వలవోక బ్రాహ్మి రాయంచనెక్కి। విహగపతి నెక్కి వైష్ణ
వి ప్రహారిదిరుగుఁ। బంచమియును జాముండియును సంచరింతు। రాత్మవాహనంబు
ల నెక్కి యహరహంబు। ననఘ శ్రీకాశికాపురాభ్యంతరమున॥ గీ॥ చిత్రఘం
టామహాదేవి శివపురంధ్రి। గౌరి నెవ్వాఁడు సేవించుఁగ శివగరి। నాతఁడు విసం
దు ప్రాణప్రయాణవేళ। యమునులులాయకఠోరఘుటారవంబు॥ శా॥ ఝంకిం
చుం గరతర్జనీముఖమునన్ శైలేశ్వరీదేవిగా। శ్యేకస్థాయినిభక్తకోటిబహు
విఘ్నౌఘంబులన్నిచ్చలున్। హ్రీంకారాక్షరమంత్రసౌధశిఖరక్రీడాకళాలోల
సా। హుంకారామరవైరిమర్దనవిధివ్యాపారపారీణయై॥ గీ॥ భద్రనాగమహా
తీర్థపరిసరమున। భద్రవాపికయందు నాప్లవమొనర్చి। భద్రకాళిక వీక్షించి
పంచజనుఁడు। భద్రసంతతిగాంచు విధ్యాదిదమున॥ క॥ సిద్ధివినాయకు గడ
వ। సిద్ధిఁద్రిసంధ్యంబు సేవసేసిన నెరయున్। సిద్ధించును మనుజునకును। శ్రద్ధా
వంతునకు విభవసంపత్సిద్ధుల్॥ క॥ విఫలోక్తిఁగాశికాపుర। విపినిరవధినిరభిసం
ధినిరవధికకృపా। భ్యధికవికీశ్వరశివసన్నిధిఁ గొలిచిననరుఁడు గాంచునిరుపమ
సిద్ధుల్॥ గీ॥ అధికభక్తితోడ నమృతేశ్వరీదేవి। సిద్ధలక్ష్మి సంభజించినరుఁడు।
నిఖిలవిరాగ్రజమునకు విషువంగముదువంగ। వేసికినయునకలిమివృద్ధిఁబొందు॥
వ॥ మెండియుఁద్రిలోకసుందరియును కందర్పదమనుశక్తియు విముక్తిక్షేత్రంబు
న కుంగస్తూరికాతమాలపత్రంబు శ్రీకంఠసన్నిధియందు మహాలక్ష్మి సభజంచు
వారలకు భోగమోక్షలక్ష్ములనొసంగు లక్ష్మీపీఠంబు మహాస్థానంబును ధకాభీ

ష్టదంబు కమలాపీఠంబున నుత్తరంబున హయకంఠియను దేవికఠినతర కుఠా
రధారాఘట్టనంబున విఘ్నదుర్ముమండంబుఖండించుఁ బాశపాణిశక్తి నంబు
వగార్గ్నిశరంబులుఘటించు వాయవ్యభాగంబున శిఖిచండిశిఖండినీ రూపధారి
యైయాయిజామిజామునఁ గేకాధ్వనులుసేయు భీమచండియుత్తరద్వారంబురో
క్షించుచుండు॥ గీ॥ కాశిభీమేశ్వరునిచక్కఁగ ట్టెదురను । బాశపుష్కరపాణి
స్మైభద్రకాళి। భీమచండీమహాదేవిభీమకుండ। పార్శ్వభూమండలంబునఁ బొ
యకుండు॥ గీ॥ భాగవత్త్రైశ్వరీదేవి శంభుశక్తి। వృషభకేతనుయామ్యదిగ్వి
ధియుండుఁ। గదిసి సేవించువారివిఘ్నముల నెల్ల । మేయుఁజిగురాకుభక్షించు
మేఁకవోలె॥ గీ॥ తాటిపాడవున నవిముక్తధామసీమ। తాళజంఘేశ్వరీదేవిత
లిరుబోఁడి। విఘ్నములఁజీరికొట్టును వెదకివెదకి। తాటికింబంబుసవ్యహస్తము
నఁదాల్చి॥ క॥ వికటావనయను దేవత। మకుటాంగదకటకహారమండనకాశీ।
వికటమునసుండుఁబాయక। యకలంకశశాంకశకలమాదలసుండన్॥ క॥ ఉద్దా
లకతీర్థంబున। నుద్దాలకనామధేయుఁ[illegible]పలిమకుటుం। డుద్దండదండధరము
ద। భిదోశిఖబ్వాంగుఁడుండుఁబ్రియమెసలారన్॥ గీ॥ అందునసియించుచుయమ
దంష్ట్రియనెడుదేవి। పూర్వదిగ్భాగమునకు విభూషయగుచు। నవ్యమహాశక్తి
నవమందహాసమయిన। మెల్లచూపునవలపించుమృడునిమనసు॥ గీ॥ దారుకే
శ్వరమనెడుతీర్థంబునందు। దారుకేశ్వరదేవునిద్ధప్రకాశుఁ। దారకేశ్వరశేఖా
వతంసుశివుని। దారకబ్రహ్మనిధిఁగొల్చు ధన్యతముఁడు॥ సీ॥ ఆదారుకేశ్వ
రంబనుతీర్థమే లెడు దారుకేశ్వరునిప్రత్యంతభూమి। సప్తపాతాళవిష్కంభ
తాళద్వయాభీకరంబును దందశూకరాజ। జిహ్వాతలంబును జీమూతవిద్యు
త్తరోష్ఠంబునూర్ధ్వాధరోష్ఠదళము। దారకానక్షత్రదళనమండలము విద్యు
ద్దండదంష్ట్రాచతుష్టయంబు। నైనవదనంబుదెఱచిబ్రహ్మాండపిండ।కబళనమున
కుఁజేసాచుకాళరాత్రి। గాళికుబ్కోదరీదేవిగదలకుండుఁ। జగ్నముండకుఁజె
లికత్తెలైలదమున॥ సీ॥ జంఘాలిముగవ్యాఘ్రచర్మాంబరముగట్టి శూలంబువ
లచేతగీలుకొలిపి। భస్మత్రిపుండ్రకంబుఫాలపట్టికఁదీర్చి నిద్ధంపుఁజిలువజన్నిద
ముతాల్చి। చనుదోయిగీకసనక్కలాపముపూనితనువల్లిరక్తకర్గమువలంది।
గరళాంజనముకల్కిగ్రాలుకన్నులఁదీర్చి మధుపానమునసుబ్బుమదికినొనఁగి।
వాసిగ్గలిమహాస్మశానవనమునందు। సంతతంబును విహరించుఁజర్మముండ। రుండ
మాంసనమధిపయాదూథఁజగ్న। ముండయట్లమహారుండమునివరేణ్య॥ శాకహా
లాపాన మునర్చియిద్దఱును నన్యోన్యంబుమత్తిల్లికా। కేళిస్సత్తవినోదకందు
కమశిక్రీడాపహారక్రియా లీలాహాస్యకథాప్రసంగములనుల్లక్షించివర్తిం చెదు

రె॥ క్ష్మాలంబుగ ఘటజన్మకాశినదుర్మర్గ గర్వించియద్దేవతల్ ॥భుజంగప్రయా
తము॥ హయగ్రీవతీర్థంబు నందభ్రగంగా।పయోవేణినిర్ధూతపాదారవింద।
ద్వయీరత్నపీఠాంకదాశ్రప్రమాణా। భయఘ్నీమహోరుండభావింతురా
ర్యుల్॥ వ॥ మహోరుండకుం బశ్చిమదిగ్భాగంబున స్వప్నేశ్వరి యాస్వప్నేశ్వ
రిభజించువారలకు భూతభవిష్యచ్ఛుభాశుభార్థంబులుగల యందుం దెలుపు
చు నవమ్యష్టమీచతుర్దశీ దివసంబులం బూజగొను నాస్వప్నేశ్వరికి పరు
ణదిగ్భాగంబున దుర్గాదేవి యాదుర్గకాశీక్షేత్రంబునదక్షిణద్వారదేశం
బురక్షించుచుండుననినం గుంభసంభవుండుశంభుతనూభవునకిట్లనియె॥ గీ॥తు
హినగిరిరాజకన్యకదుర్గయయిన। కారణంబేమికందర్పవైరితనయ।అనతిమ్ము
న్నగుహుండువింధ్యాద్రిదమన। వినుమనుచుఁజెప్పఁదొడఁగెనవిస్తరముగ॥
వ॥ దుర్గుండనఁగనొక్కరాక్షసుండురురునికొడుకు తపోబలంబుననవధ్యుండై
భూర్భువస్స్వర్భువనంబుల బాధింపందొడంగిన దేవతలు మహేశ్వరునభయం
బువేఁడిరి శివుండునురాక్షసునింభంజింపదాక్షాయణిని నియోగించిన॥ గీ॥ గౌరి
వింధ్యాద్రికేతెంచి కాళరాత్రిఁ। బంచెరాత్రించరేంద్రునిబట్టితేరఁ। జంపఁ
బాతాళమునకన్పఁజాలునట్టి। శక్తియునుసేర్పునిచ్చియైశ్వర్యమొసఁగి॥వ॥కా
ళరాత్రియురుద్రాణియాజ్ఞశిరంబునందాల్చి యద్దైత్యుసన్నిధికరిగి యతని
తోనిట్లనియె॥ గీ॥ రాయబారంబువచ్చితిరాక్షసేంద్ర। యచలకన్యకపనుప
వింధ్యముననుండి। బుద్ధిమంతుఁడవైతేని భువనములకు। బాధసేయకనుండు
నిష్పాపబుద్ధి॥ వ॥ వేదోక్తంబులైన సర్వక్రియాకలాపంబులుం బ్రతిష్ఠింపం
బాలుపడ్డయదిభవాని యమ్మహాదేవి యాజ్ఞంజేసి పెద్దకాలము బ్రతుకుము
గాదేనిబంటవై యకుంఠితోత్సాహంబున నక్కంఠీరవవాహతోడయుద్ధము
గావింపుము॥ గీ॥ హితముచెప్పితివినసేర్చితేనిలెస్స। జగముబాధింపకుండు
టచాలుమాకు। దుహినగిరికన్యయానతిద్రోచితేని। నీడ్చికొనిపోదువెండ్రుక
లిరియఁబట్టి॥ వ॥ అనిగర్వించిపలికిన కాళరాత్రిం జూచి కనలి రాత్రించరేశ్వ
రుండు॥ సీ॥ అట్టహాసముచేసిమోరాపరితాపోక్తులాడదానికి నింతయుదటు
వలదు। ఏమన్ననినియోగాకేమిమీయేలికె సానినివచ్చితిఁజాలుమాకు। జగ
దేకసామ్రాజ్యసంపత్తియునుబోని యీవుండవలదెమాయింటనెపుడు। నేత
దర్థమకదాబుషి దేవతాకోటిఁ దట్టిపెట్టినవాఁడఁ బట్టితెచ్చి। వంటయిలు
సొచ్చెఁ గుం దేలుపనజనయున। మెచ్చినారమువిధినిన్నుఁదెచ్చినపుడ। యఁడ
విలోపలనున్న గేహామునసున్న। బొందఁగలభాగ్యవిభవంబుపొందుబురుష॥
వ॥ అనియంతఃపురచరుల డీనిసభ్యాంతరంబునకుం గొనిపొండనిపలికినం గళ

వళింపక కాళరాత్రి రాత్రించరేశ్వరున కిట్లనియె॥ ఉ॥ నీతివిదుండవు పురజని
చరవంశవరేణ్యయవ్వా వేగ దూతలమాటకుంగినియు దూతలు నేరక యాడిన
ప్పుడుం। గాతురుదప్పవిశ్వనయకార్య ధురంధరులైన భూపతుల్। దూతకుని
ష్టసిద్ధికయితూలంగ నాడంగ జెల్లభూపతీ॥ సీ॥ నయపరాక్రమము లెన్నడుం
బ్రయోగింపవే దేశకాలములు శోధించి చూచి। నన్నుం బట్టంగ నేమియున్నది
పట్టంగరాదన నేని లెదు రాజవదన। నెందఱిబ్బరుని నీకు నేను పైతెంబుగాం బర్వతా
త్మజపట్టువడ్డయప్పు। డేనాంక నున్న ప్పుడెవ్వరు చూపెదరింక నెత్తింగియయ్యెం
దువదన। వేంటకానికి మృగము లే వెంటవచ్చుం। దెలియుమా దీముంగాలిచితి
న్నపిదప। నన్నుం బట్టియ సాధింపునగతనూజం। బ్రభవనిర్జితదిగధీశ రాక్షసేశ॥
గీ॥ కాంతగందువం బెట్టినీకడకు మేలు। చెప్పవచ్చిననన్ను శిక్షింపందగునె। మొ
నసిహితమాచరించిన ముండముక్కు। కోంతపడునను మాటనర్ణగోచరించె॥
శా॥ నీయాజ్ఞంగడుగాసిం బెట్టెదరునర్ణ బెక్కం డ్రుదునంతఃపుర। స్థాయుల్ వ
క్షధరుల్ పయోధరతటీసంవ్యానముల్గొప్పునర్ణ। జేయుర్ణ జెట్టయుంబట్టి రాజు
లుపరస్త్రీనింత సేయింతురే। న్యాయంబాయిదిమాన్పు నిగ్రహము మేలందిం
దు నీకెమ్మెయిర్ణ॥ వ॥ అనికాళరాత్రిసకరుణంబుగాం బలుక నుగ్రోధాంధుం
డై యవ్విబుధవిరోధివినియు విననియట్లయూరకుండెం బాదపాదమనిసోవిద
ల్లులు హస్తపల్లవంబులు పట్టితివిచిన నప్పుడు కజాక్షి కంకణఝణఝణత్కారం
బుగాంగెంగేలుగుదిలిచితివిచికొని వికటకుటిలభ్రుకుటినటనభీషణఫాలఫలక
వైకలకలంగటికిన గవునగి కన్నులనిప్పులురుల హుంకారంబు సేసినం గల్పాంత
కాలాదికరాళకాళవ్యాళఘనాఘనఘటాకఠోరదీర్ఘనిర్ఘాత ఘటాపాతంబు
నకు దాతయగునాసిర్ఘోషంబువిని గుండియలవిసిబెండుపడియంగజాలలు గా
లుగాలం బెఱచుకొని చాపకట్టువడంగూలిన నచ్చెరువు మచ్చరంబును గోపం
బును నాటోపంబును నెరయ మెరయదుగ్గానుసురుండు ఖడ్గఖేటకంబులు ధ
రియించిడిగ్గనగద్దియదిగనుఱికిన నప్పుడు దస్తంబుచొచ్చి దుర్ముఖుండు సీరపాణి
యుం బాశపాణియు సురేంద్రదమనుండును ఖడ్గరోముండు నుగ్రాక్షుండును
దేవకంపనుండు సహంపూర్వికాసంఫుల్లపుటంబులగు చేత సంపుటంబులం బు
టపుటనియవష్టంభంబు పూని కుంభినేంద్రసన్నిభాకారులుకుతారభిండివాలమం
డలాగ్రత్రిశూలపట్టిసప్రాసతోమరంబులు ధరియించి యమ్మహాదేవింజుట్టు
ముట్టిపట్టనురువడించిన॥ మ॥ ఘనకాదోద్ధలిభద్రకాళికకటాక్షజ్యోత్స్నం
గెంపారను। హ్వానివ స్త్రింబు బిగించి యాంటుటయనులాక్షగ్నిచ్ఛటల్ ప్రగ
ల్భమ్మవే। చ్చసిజాంఝాపవమానముప్పతిలరత్నకోటినొక్కమ్మనిర్ణ। గొనివా

పడచిరాసంరంభంబున॥ సీ॥ శక్తిరాక్షసుతోడ రాక్షసుఁడు శక్తి తోడఁదల
పడసమధికాద్భుతముగాఁగ॥ ద్వంద్వయుద్ధంబుసాగెవింధ్యంబుమీఁద। బ్రక
టవిస్ఫురబహువిధప్రహారణములు॥ వ॥ త్రైలోక్యవిజయతోడ దుర్ధరుండును
దారతోడ దుర్ముఖుండును జయతోడ శిరుండును త్రైలోక్యసుందరితోడ సీర
పాణియుఁ ద్రిపురతోడఁ బాశపాణియు జగన్మాతతోడ సురేంద్రదమనుండును
త్రిపురభైరవితోడ దేవకంపనుండును గామాక్షితోడ ఖడ్గరోముండును గ
మలాక్షితోడ వజ్రపాణియుఁ ద్రిపురతాపసితోడఁ బిడాలాక్షుండును జయం
తితోడఁ గుక్కుటాక్షుండును విజయతోడ గపింజలుండును నపరాజితతోడ
గౌరవక్త్రుండును శంఖినితోడ ఘూకరవుండును గజవక్త్రితోడ శంఖకర్ణుం
డును మహిషాక్షితోడ జలధరుండును రణప్రియతోడ బకుండును శుభానంద
తోడఁ గిమ్మీరవుండును గోటరాక్షితోడ ధూమ్రనఖుండును శివారావ
తోడ ధూమ్రాక్షుండును త్రినేత్రతోడఁ బింగాక్షుండునుం దలపడినం బోరు
ఘోరంబయ్యె నయ్యవసరంబున॥ శా॥ ద్యావాపృథ్వ్యవకాశముల్ భుగులు
కోనందంద వింధ్యాద్రిఘూర్ణాటవీధిన్ జెలఁగెన్ గఠోరతరకంఠక్ష్వేళ నాదంబు
తో। దేవీదానవకోటినిష్ఠురభుజాళీ ప్రౌఢనానాధను।ర్జ్యావల్లీభవభూరిఘాం
కృతులురుద్రాఘిష్ఠదీర్ఘధ్వనిన్॥ క॥ శక్తులతోఁ సరిపోరెను। నక్తంచరకోటిప్ర
హారణవ్రాతములన్। ముక్తాముక్తంబులఁగర। ముక్తంబులయంత్రముక్తము
లముక్తములన్॥ మ॥ తిమిరంబుల్ ఘటియించెఁబట్టపగలున్ దేవీమరుద్విద్వి
ష। త్సమరారంభములన్ సముద్భటభుజాచక్రీభవద్దీర్ఘదు। ర్దమకోదండవి
నిర్గతంబులయి హేరాళంబు పారక్షుర।ప్రమహాభల్ల శిలీముఖాంజలిక నారా
చార్ధచంద్రేషువుల్॥ వ॥ ఇవ్విధంబున నుభయసైన్యంబులు సరిపోరుచుండ
వింధ్యవాసినీ మహామాయ వాయవ్యాస్త్రంబు ప్రయోగించి రాక్షసుల శ
స్త్రాస్త్రంబులు దూలనడఁచిన నిరాయుధులై యద్దైతేయులు విచ్చిపఱచిరం
తదుర్గాసురుండు దగ్గరి మహాశక్తి నిజశక్తిం గొని వైచిన॥ గీ॥ రాక్షసుఁడు
వైచినట్టి యాప్రబలశక్తి। శక్తివైచి విఖండించె శంభుశక్తి। చక్రమున వైచె
వింధ్యాద్రి సదనవసుర। శైలకన్యకయదిద్రుంచెఁ జక్రమునను॥ గీ॥ అనిమిషా
రాతి విల్లెత్తనగజద్రుంచె। శూలమెత్తినఖండించెసిలవేఁగి। పరియలుగఁజే
సెగదయెత్తభద్రకాళి। ఖడ్గమెత్తినఁజక్కాడెఁగంబుకంఠి॥ మ॥ వడివింధ్యా
చలగండశైలమునదస్యువంగనేతెంచుచో। నుదురాజార్ధశిఖావతంసు సతి
యత్యుగ్రంబువహ్న్యస్త్రమున్। దొడిదుర్గాసురుసేయవాఁనువడిమోడ్ దు
ర్వారవజ్రాహతిన్। బడుశైలంబును బోలి మెచ్చిరి హరిబ్రహ్మాదిబృందారక

౮॥ వ॥ అప్పుడు దేవీజగద్ధాత్రీ జగత్త్రయీజననీ మహేశ్వరీ మహాశక్తియై
త్ర్యద్రుమకుటారిక త్రైలోక్యవ్యాపిని శివా శంఖచక్రగదాశార్ఙ్గధారిణి వి
ష్ణుస్వరూపిణీహంసయానసృష్టివిధాయినీ యనాదినిధన వాగ్జన్మభూమి చతు
రాననమైంద్రీకౌబేరీ వాయవీవారుణీ యామినీనైరృతీ నైశీపావకీశశాంకకౌ
ముదీ సౌరీసర్వమయీపరమేశ్వరీగౌరీ సావిత్రీసరస్వతీప్రకృతి యహంకృతీబ్ర
హ్మాండాంతస్థమహాదేవీ పరయుపరవరాపరపరముపరమాత్మస్వరూపిణీ సర్వస్వ
రూపసర్వగచిచ్ఛక్తి మహామాయ స్వాహాస్వధాశ్రౌషడ్వౌషట్ స్వరూపిణి
ప్రణవాత్మిక సర్వమంత్రమయీ చతుర్వర్గాత్మిక చతుర్వర్గఫలోదయయనియ
నేకప్రకారంబుల దేవతలు ప్రస్తుతించిరి భద్రకాళియు నిర్జరులకభీష్టవరంబులు
ప్రసాదించె దుర్గాసురుని మర్దించి జగంబుల దుర్గతి మాన్పుటం జేసి భర్గగృహి
ణికి దుర్గాభిధానంబు గలిగె దుర్గాదేవి కాశీక్షేత్రంబునం దుపసర్గాదిదో
షంబులు మాన్చు దుర్గాకుండంబున గృతస్నానుండైన నరుండు దౌర్గత్యంబు
లు వాయు దుర్గా శరీరంబునందుం బుట్టిన శక్తులు దుర్గా సమీపంబునందధి
వసించి పంచక్రోశంబున నిరాక్రోశంబుగా శాసింతురు మరియు శతనేత్ర సహ
స్రాస్యా యుతభుజ యశ్వారూఢ గజాస్య త్వరితశవవాహిని విశ్వసౌభాగ్యగౌ
రిపీరులొమ్మండ్రడను శక్తులు రురుండు చండుండసితాంగుండు గపాలివిక్రోధనుం
డున్మత్తభైరవుండు భీషణభైరవుండీయెనమండ్రు భైరవులు విద్యుజ్జిహ్వుండు
లలజ్జిహ్వుండు క్రూరాస్యుండు క్రూరలోచనుండుగ్రుండు వికటదంష్ట్రుండు వ
క్రాస్యుండు వక్రనాసికుండు జంభకుండు జృంభణముఖుండు జ్వాలానేత్రుండు వృ
కోదరుండు రక్తనేత్రుండు మహానేత్రుండు తుంగనేత్రుండు ముండుండు జ్వలత్కే
శుండు కంబుశిరుండు వృద్ధగ్రీవుండు మహాహనుండు లంబకర్ణుండు కర్ణప్రావర
ణుండాదిగాఁగల భేతాళు లసంఖ్యాతులు భూతంబుల సంఖ్యలిందఱు కాశీక్షే
త్రంబు సంరక్షింతురనినఁ గుంభసంభవుండు గౌరీస్థానంబున దివ్యలింగంబు లె
న్నితత్ప్రభావం బానతిమ్మనినఁ బార్వతీ దేవికిభవుం డానతిచ్చిన ప్రకారంబున
నయ్యగస్త్యునకుఁ గుమారుండిట్లని చెప్పె॥ సీ॥ ఆనందవిపినంబునందాదిమబ్ర
హ్మ దపమాచరించె నత్యంతనిష్ఠఁ । బర్యాయమున నేగెఁ బదిమాఱులు యు
గంబులంతఁ బాతాళలోకాంతరమున । నుండియుద్భితమయ్యెనొకదివ్యలింగం
బు బహుకోటిరవివిభాభాసితంబు । విధిమనోపేక్షిభావించునే తేజమాతేజం
బు లింగమూర్తి నాశ్వమొందె । భూరిభువనాగ్రభాగవిస్ఫుటనవేళ । సంభావిం
చిన భటభటార్జనా॥ క్రియమను శోధనసమాధియోగంబు విడిచి । కన్నుదెని
మిషియునువిచ్చెఁ గమలభవుఁడు॥ సీ॥ ఆదిమతేజంబు సాధకారము వొఁదెఁ

గైటభారాతియకారరేఖ|సటంజూడంజూడబ్రీత్యతృ మయ్యెనుకారమంబుజా
సనునిరూపంబు దాల్చె। తదనంతరంబ చంద్రరేఖావలంను చందంబు గైకొని మకా
రంబు మెఱసె। నంతశబ్దబ్రహ్మమయిన నాదంబున భువనహేతువును బిందువును
దోఁచె। నఖిలమును గూడి యోంకారమయ్యెం బిదపం గ్రమముతోఁ గుంభభ
వ యకారము నుకార। మును మకారంబునగు వర్ణములును నాద। బిందువులు
ధాతయగ్రంబునందు నిలిచి॥ వ॥ ఎయ్యది సంసారతారకంబగుట దారకంబయ్యె
నెయ్యది ప్రకర్షంబునం జేసి యశేషవిక్రియా విరహంబునం గూటస్థనిత్యంబ
య్యెను బరమానంద ప్రకాశంబున సర్వదాయభినవంబగు పరబ్రహ్మంబున
కు వాచకం బగుటం బ్రణవాభిధానంబు వహించె నెయ్యది యకారో
కార మకార బిందు నాదంబులై దవయవంబుల వలనను బంచాశత్కళా
రూపయగు మాతృకకుం గారణభూతంబయ్యె నెయ్యది త్రయీమయంబు తురీ
యంబు తురీయాతీతంబు నిఖిలాత్మకంబన నంబరఁగు నెయ్యది చతుశ్శృంగంబు స
ప్తహస్తంబు ద్విశీర్షంబు త్రిపాదంబు త్రిధాబద్ధంబై వృషభాకారంబై మోఁ
యు నిద్రానియందు బ్రహ్మస్థంబగు జగంబభిలీనంబై యుండు నెయ్యది యకా
రోకార మకారంబులను వర్ణత్రితయంబుచే వేదచతుష్టయాత్మకంబును గా
ర్హపత్యదక్షిణాహవనీయ సంవర్తకాగ్నిరూపంబును బృథివ్యంతరిక్షద్యు
సోమలోకాత్మకంబును నుదాత్తానుదాత్త స్వరిత ప్రచయాత్మకంబును భూ
తభవిష్యద్వర్తమాన సాధారణకాలాత్మకంబును నాఁడను నిద్రానియందాధ
ర్మంబునందు ముఖంబునుం బోలె స్వప్రకాశకచిద్రూపుండు పరమేశ్వరుండు
ప్రతిబింబించు నెయ్యది యకారాది వర్ణంబు లేకత్వంబు నొందునట్లు గాసం
యోజింపసద్గుణయను సంధిగూడి మంత్రత్వంబు నొందు నట్టి యోంకారమం
త్రంబు దివ్యలింగస్వరూపంబై యావిర్భవించినం గనుంగొని పంకజాసనుం
డు నమ ఓంకారస్వరూపాయ నమస్స్వరూపస్వరూపిణే నమో రుద్రాయన
మో భవాయ నమశ్శర్వాయ నమ ఉగ్రాయ నమస్సామర్గ్యజుస్స్వరూపాయ
నమో నాదాత్మనే నమో బిందుకళాత్మనే నమో లింగాయ నమో లింగస్వరూ
పాయ నమో భీమాయ నమః పశుపతయే నమస్తారస్వరూపాయ నమశ్శివాయ
నమః కపర్దినే నమశ్శితికంఠాయ నమో మీఢుష్టమాయ నమో గిరిశాయ నమ
శ్శిపివిష్టాయ నమో హ్రస్వాయ నమో బృహతే నమో వృద్ధరూపిణే నమః కుమా
రగురవే నమః శ్వేతాయ నమః కృష్ణాయ నమః పీతాయ నమో రుణమూర్త
యే నమో ధూమ్రవర్ణాయ నమః పింగళాయ నమః కిమ్మీరవర్చసే నమః స్ఫా
టలవర్ణాయ నమో హరిత తేజసే నమో నానావర్ణస్వరూపాయ నమో వ్య

పతయే నమస్స్వరరూపాయ నమో వ్యంజనరూపాయ నమఉదాత్తానుదాత్త
స్వరితరూపాయ నమో హ్రస్వదీర్ఘప్లుత విసర్గాత్మనే నమోనుస్వారస్వ
రూపాయ నమస్సానునాసికాయ నమోనిరనునాసికాయ నమోదంత్యాయ
నమస్తాలవ్యాయ నమఓష్ఠ్యాయ నమఉరస్యాయ నమఊష్మస్వరూపాయ న
మోంతస్థాయ నమఃపినాకినే నమోనిషంగిణే నమోనిషాదపతయే నమస్తారా
య నమో మంద్రాయ నమోమధ్యమాయ నమోఘోషాయ నమోఘోష
మూర్తయే నమస్తానస్వరూపాయ నమోమూర్ఛనాస్వరూపాయ నమస్థాయి
సంచారస్వరూపాయ నమోలాస్యతాండవజన్మనే నమస్తౌర్యత్రికస్వరూపాయ
నమస్థ్నాలాయ నమస్సూన్తామ్నాయ నమోదృశ్యాయ నమోర్వాచీనాయ నమఃప
రాచీనాయ నమోవాక్ప్రపంచస్వరూపాయ నమఏకాయ నమోనేక భేదా
య నమస్సదసత్పతయే నమశ్శబ్దబ్రహ్మణే నమఃపరబ్రహ్మణే నమోవేదాంత
వేద్యాయ నమోవేదపతయే నమఃపార్వతీశ్వరాయ నమోజగదీశ్వరాయన
మోదేవదేవాయ నమశ్శంకరాయ నమస్తుభ్యం మహేశ్వర నమస్తుభ్యం జగ
దానంద నమస్తుభ్యం చంద్రశేఖర నమస్తుభ్యం మృత్యుంజయ నమస్తుభ్యం
త్ర్యంబక నమస్తే పినాకహస్తాయ నమస్తే త్రిశూలధారిణే నమస్తే త్రిపురఘ్నా
య నమస్తేంధకనిషూదనాయ నమః కందర్పదర్పదళనాయ నమో జలధర
దహారాయ నమః కాలాయ నమః కాలకూటవిషాదినే నమో భక్తవిషాదహం
త్రే నమోనమయని యనేకప్రకారంబులం బ్రస్తుతించిన॥ సీ॥ హారుఁడకారే
శ్వరుండై కైటభారాతి యాకారరేఖఁ బ్రత్యక్షమయ్యె। శివుఁడు కారేశ్వర
శ్రీమహాదేవుఁడై ధాత్రుస్వరూపంబు దాల్చియొలసె। గంగాధరుండు మకా
రేశ్వరుండయి విధుమౌళితేవ నావిర్భవించె। నాగకేయూరుండు నాగేశ్వరుం
డయి భాసిల్లి శబ్దరూపత వహించె। విశ్వలోకైకభర్త బింద్వీశ్వరుండయి। భువ
నకారణభావంబు పూనిమెఱసె। నిందఱును బ్రహ్మకిచ్చిరభీప్సితంబు। లైదులిం
గంబులును బ్రణవాత్మకములు॥ వ॥ ఈయైదును దివ్యలింగంబులు॥ గీ॥ దమను
ఁడను బ్రాహ్మణుఁడు భరద్వాజగోత్రుఁ। డాదివర్ణాశ్రమమునను వింధ్యాద్రిద
మన। పాశుపతదీక్షుఁడై కొని కాశియందు। సిద్ధిచేకొనెనవిముక్తసీమయందు॥
గీ॥ భారభూతేశ్వరుడుయక్షభర్త దిశకు। నింద్రదిశకును మణికర్ణికేశ్వరుండు।
బ్రహ్మగోకర్ణపతులవాక్పశ్చిమములకవధులవిముక్తమునకువింధ్యాద్రిదమన॥
వ॥ అట్టహాసుండు ప్రాగ్ద్వారమును భూతధాత్రీశ్వరుండు దక్షిణద్వారంబును
గోకర్ణుఁడు పశ్చిమద్వారంబును ఘంటాకర్ణుండుత్తరద్వారంబును ఛాగవ
క్త్రుం డీశదిక్కోణంబును భీషణుండు వహ్నిదిక్కోణంబును శంకుకర్ణుండు

రాక్షసదిక్కోణంబును ద్రుమిచండుండును వాయుదిక్కోణంబును నానాప్రమథ
గణపరివృతులై రక్షింతురు గోలాక్షరణభద్రకాళీయుక్తాలకంపనులు గంగా
తీరంబును వీరభద్రనభశేకర్దమలిప్తవిగ్రహస్థూలకర్ణమహాబాహులసితీరం
బును విశాలాక్షమహాభీమకుండోదరమహోదరులు దేహళీదేశంబును సం
దక్షిణపాంచాలఖురపాదకరండకానందకాయబభ్రులువరణాతీరంబును గాచి
యుందురు॥ గీ॥ కపిలసావర్ణ్యలకును శ్రీకంఠపింగ। ళాంశుమాలులకును నొ
క్కయవసరమున। నేపురహరుం గల్గెనాశ్చర్యమేమి చెప్పఁ। దనుపుత్రో డనశివుఁ
గూల్చికోసంగఁగాశి॥ చ॥ కలశతనూజయుచ్చెరువు కాశికయందొక శంభులింగ
ముం। దిలలనుసక్షతంబులను ధీనిధి యొక్కఁడు పూజచేసి పో। నొలికినవానిమే
యుటకు నోలిఁ బ్రదక్షిణమాచరించి చి। ల్కలుకశరీరముం దొఱఁగఁ కెక్కెను
బోరజతాద్రికూటమున్॥ క॥ ఘటసంభవ శ్రీకాశీ। కటకముసకునికటగగన
గంగాతటిని। చటులకృపీటోర్మిఘటా। స్ఫుటదఘముసకైన మెయితెరవుట
భేదనముల్॥ శా॥ అంభోజాసనునంపవానికిని శక్యంబే నుతింపంగనో। కుంభీ
సంభవ దుంతిరాజకరటక్రోడత్సరద్దానవా। స్పంభేద ప్రవిజృంభమాణవరణా
సంపర్కసంపన్నకో। క్షింభరశ్యామరసింధునైకటకమున్ శ్రీకాశికాక్షేత్ర
మున్॥ క॥ అవిముక్తంబవిముక్తం। బవిముక్తంబనుచుఁ బ్రాతరారంభము
లం। దవధానవరత నెవ్వం। డువచించును వాఁడు ధన్యుఁడు మునిప్రవరా॥ గీ॥
మొగుచు జంతువు గాశికానగరసీమ। నపునరుస్మిలనమునకై యక్షియుగముఁ
గాంచు నిక్కలగా నొక్కకలయునపుడు। త్రిణయనుండు గందన్ను నద్దీర్ఘనిద్ర॥
ఉ॥ ఎట్టిను తింతు నల్పమతి నిల్వలమర్దన యేను గాశికా। పట్టణశంభుమూర్తుల
కృపాగుణమూర్తులతాంగి ప్రేపెదు। రక్కట్టినముంగిటం గసవు గాండ్రయఁ
బుచ్చుచుఁ జేతిచీపురుం। గట్టయు దానుబోచ్చుఁ గఱకంఠునినోంకృతినాదదే
వున్॥ గీ॥ ఓంకృతి శ్రీమహాదేవునొద్దఁ గలదు। బిలము పాతాళమున కేగుఁ బె
ద్దత్రోవ। దానివాకిట సుంద్రుమాతాపిదమన। సావిదల్లులు కుఱుపల్లజడల
ఋషులు॥ గీ॥ వెంటఁబడి వచ్చుఁ గాశికి వెఱచి భేకి। తిరిగె నందంద నోంకారదే
వుభవన। మటఁ బ్రదక్షిణ మొనరించె నట్టి మహిమ। నొడలి త్రోడ నెయూకస్ప
మృదునిగలసె॥ గీ॥ పాడి మెచ్చించె నొకయింతి పంజళమున। నాడి మెచ్చించె
లేమ లాస్యమున నోతుక। పొగడి మెచ్చించె నొకలేమ చిగురుఁబోఁడి। కరుణ
గలవాఁడు కాశినోంకారభర్త॥ మ॥ మనుజుండెవ్వఁడు కాశికిం జనఁడు శ్రీమ
త్రోస్సైదరీతీర్థము౦। గనఁడోంకారశశాంకమూర్తునకు మ్రొక్కఁడద్దురాత్ముం
డవో। మునిశార్దూలవినాశకారణము దోర్మూలాగ్రికూలంకష। స్తనభారా

లసమూర్తుమధ్యజననీ తారుణ్యసంపత్తికిన్ ॥ చ॥ పనివడి ఫాలలోచనుఁడు సర్వ
తరాజతనూజ కానతి। చ్చినపరిపాటినీ కువర సేయక చెప్పెద సావధానతన్। వి
నుకలశీతనూభవ త్రివిష్టపనాథసమాహ్వయత్రిలో। చనచరితంబు సర్వకలు
షఘ్నము పుణ్యసమృద్ధ్యుపఘ్నముల్॥ క॥ విరజాహ్వయమగు పీఠము। పరమ
ఋషిప్రవర కాశిపట్టణరత్నా। భరణము తద్ధ్యానమున। నరుఁడును విరజస్కుఁ
డగును నఘనిమిషమునన్ ॥ గీ॥ అనఘచారిత్ర కాళిందియును సరస్వ। తియును
నర్మదయును దదంతికమునందుఁ। గాలు దిక్కునఁ బ్రవహించుఁ గాలకూట।
కంఠపాదాబ్జపీఠోపకంఠ మొరసి॥ ఉ॥ సంభృతభక్తి భావనఁ ద్రిసంధ్యమునందు
ను నాతరంగిణుల్। శంభుఁ ద్రివిష్టపేశ్వరుని జంద్రకళాధరుఁ దీర్థమార్చువి।
స్రింభమునం గరాంబురుహ సంగతమంగళశాతకుంభకుం। భోంభితగంధసార
రసయోగసుగంధనవాంబుధారలన్॥ క॥ స్థాపించె నాస్థలంబున। నాపుణ్యతరం
గిణిత్రియము దండ్రికళా। నైపథ్యంబుల భుజగక। లాపంబుల విమలమణిశిలా
లింగములన్ ॥ ఉ॥ నిండుమనంబుతోడ రజనీకరమౌళిఁ ద్రివిష్టపేశ్వరున్। దం
డనమస్కృతిప్రవణతన్ భజియించిన మర్త్యకోటికిన్। వెండియుఁ గర్మబంధ
ములె వెండియు నాదివికారబాధలే। వెండియు మాతృయోనిపదవీచ్యుతిసంకట
మే ఘటోద్భవా॥ మ॥ గయకేలాయకు గంగమానవులకుం గాశీపురీవాహినీ।
త్రియవేణీపులినంబులందు నిడ రాదా తల్లి నిందండ్రినిం। బ్రియమాతామహు
లం బితామహులనుం జేర్కొంచు బిండాన్నము। ల్గయి కోరోటుప్రియంబు
తోడఁ బితరుల్ హస్తాగ్రముల్ సాచుచున్ ॥ గీ॥ దక్షిణంబు ద్రివిష్టపస్థానమున
కుఁ। జెంగట సరస్వతీమహాక్షేత్రమనఘ। యిచ్చఁ గొలిచినవారి కయ్యెందు
ధరుఁడు। గరుణ సారస్వతంబైన పరమపదము ॥ క॥ యమునేశ్వరుఁడు ద్రివిష్ట
ప। సమీపమున నంబుపతి దెస న్వసియించున్। యమపుటభేదనని కట। ద్రుమ
వాటికఁ జూడ నవ్విధుధరుని భక్తుల్ ॥ గీ॥ అత్రిలోచను ప్రాగ్దిక్కునందు నుం
డు। నర్మదేశుండు నిజభక్తిశర్మదాయి। శైవదీక్షావిధిజ్ఞ తత్సేవకులకు। మా
తృగర్భార్భకత్వంబు నుండు కోడుకు ॥ సీ॥ అఖలనీవారముష్టింప చాగ్రిగణ్య।
ప్రిత్యహంబు ద్రివిష్టపద్రిష్టయెవ్వఁ। డవ్విశిష్టుఁడు విష్టరాభ్యంతరమున। వీస
మంత్రటెమాత్రింబు వెలితిసృష్ట ॥ ఉత్సాహ॥ లీలమనుజుఁ డెవ్వఁడేఁబిలిప్పిలా
తరంగిణీ। దేలిశ్రీత్రివిష్టపేశుఁ ద్రిపురమథను శశికళా। మౌళిఁబూజసేయుఁ గు
సుమమాల్యములనతండుడా। కాలిమడమఁ జప్పిడించుఁ గాలమృత్యువక్త్రి
ముల్॥ మాలిని॥ ఉత్తరవాహినియై ప్రవహించుచున్న పిలిప్పిలఁ గుంకిమ
దిం। దత్తరపాటొకయించుక లేక యథావిధిఁ గోమలతారకరా। స్తిత్తకిరి

టుఁడి త్రివిష్టపనాయకుఁ డెన్నసమంబుగఁ గొల్చినఁ దా। స్తోత్రముఁ గాంచినను
స్మృతి సేయుఁడు దుష్కరపీడఁ జరించునరుల్॥ గీ॥ ఇతర దేశంబులందుఁ బాపిష్ఠితము
లయిన। పాపములు వాయుఁ గాశికాపట్టణమునఁ। గాశిఁ జేసినపాప మెక్కడను
బాయు। దదియుఁ బాయుఁ ద్రివిష్టపోపాంతభూమి॥ గీ॥ కాశి జంబూతరుద్వీపక
నకభూమి। గాశియం దుత్తమంబు ల్గమనిరూఢి। సింధుసంభేద మోంకారశివప
దంబు। శ్రీత్రివిష్టపనాయకక్షేత్రతలము॥ క॥ విదితముగఁ గాశినక్షమం। త్రిదశ
మణికిరీటకోటిదీధితివిలస। త్పదుని త్రివిష్టపుఁ గొలిచిన। సదవీయసి మోక్షపద
వియధికవివేకా॥ శా॥ కుంభీసంభవ శ్రీత్రివిష్టపుని గ్లౌకోటీరు సింధుత్రయీ। సం
భేదస్థలివాసుఁ గొల్చువరుని సాధింపఁగాఁ జాలునే। కుంభీపాకముఖప్రధానన
రకక్రూరప్రకారవ్యథా। సంభారంబుల నీనఁజాలు మదిరాస్వాదాదిపాపౌఘ
ముల్॥ సీ॥ క్రూరుండు పిశునుండు గోఘ్నుఁడు భర్త్యభక్షకుఁడు విస్రంభవిఘాతు
కుండు। గురుతల్పగుఁడు నిందకుఁడు నాస్తికుఁడు కూటసాక్షి పరద్రవ్యచౌర్యప
రుఁడు। మాతాపితృత్యాగి యాతతాయి శఠుండు పరదారలోలుండు గరళదుం
డు। కులధర్మవిముఖుండు గురుజనద్వేషుండు బ్రహ్మహత్యాసురాపానరతుఁ
డు। నాఁగఁ గలపాపులకఘంబు సీఁగదిక్కు। శ్రీత్రివిష్టపదేవుండు శేషధరుఁడు।
నీలలోహితు నభవు నిందించునట్టి। కర్మచండాలునికిఁ దక్కఁ గాశియందు॥ క॥
ఇందుకళాశేఖరుని। నిందించుట నిగమపదము నిందించుట ద। ల్లిందం ద్రిన్నిర
దించుట। నిందించుట హర్యజాదినిర్జరకోటిన్॥ క॥ శివనింద సేయుపాతకు। జపు
దప్పునఁ జూచి తొలఁగఁ దగు శైవులకున్। శివనిందాపరుపలుకులు। చెవిసొడ్డి
వినంగఁ దగదు శివభక్తులకున్॥ ఉ॥ సత్యము పల్కెదన్ శ్రుతులు శాస్త్రము
లాగమముల్ పురాణముల్। ప్రత్యయమయ్యె నే నిజముఁ బల్కెద రింతియు కాక
యేమిదు। ర్గత్యపహారదక్షయగు కాశియ తీర్థము తీర్థకోటిలో। నిత్యుఁడు విశ్వ
నాయకుఁడు నిక్కపుదైవము దైవకోటిలోన్॥ గీ॥ ఆదిపంచనదంబునయందు
మునుఁగు। నాఁడు మణికర్ణికాతీర్థ మంతమీఁద। విశ్వనాథుని భక్తి సేవిం
చుఁ బిదప। నటవిఖండించు మనుజుఁ డొక్కఁడ యఘంబు॥ శా॥ వాతాపీల్వల
దైత్యమర్దన తగుష్వర్ణింపది వ్యామృత। జ్యోతిర్లింగతనున్ త్రివిష్టపుని సస్తోక
ప్రభావాన్వితున్। బాతాళంబుననుండి వెల్వడి పురీపర్యంత భాగీరథీ। స్రోతస్వి
న్యుపకంఠభూమిఁ గృతవాసుం డైన సర్వేశ్వరున్॥ వ॥ త్రివిష్టపేశ్వరునకుఁ బ
శ్చిమభాగంబున ద్రోణేశ్వరలింగంబు తదగ్రభాగంబున సర్వార్థామేశ్వరలింగం
బులపలుంద శాంతవవేశ్వరలింగం బర్వార్థామేశ్వరలింగంబునకు వాయుదిగ్భా
గంబున వాలఖిల్యేశ్వరలింగంబు తత్సమీపంబున వాల్మీకేశ్వరలింగంబు వా ళ

యుఁ ద్రివిష్టపేశ్వరలింగంబుమాహాత్మ్యంబభివర్ణించెద ॥ గీ॥ అమ్మహాదేవు
ప్రాసాదమాశ్రయించి। యుండుపారావతంబులు రెండు నెమ్మి। నాలుమగఁడు
నగహ్వర్గగాహస్థ్యగరిమ। సకలకాలంబుగవఁగూడిసంచరించు॥ సీ॥ పక్షా
గ్రములవీచిప్రాసాదవలభికా పర్యంతములధూళిపాఱఁదుడుచుఁ । జరువు
యాతాయాతములఁబ్రదక్షిణములు మాటిమాటికిగర్భమంటపికకు । సోమ
సూత్రప్రణాళీమార్గనిష్ఠ్యూత తీర్థోదకంబులుదివుటఁగ్రోలు । భక్షించుదే
హళీబల్యర్థనిక్షిప్తపిండసిక్థములుసంప్రీతియెసఁగ । వినుత్రికాలంబునర్చనావే
ళలందు। శంఖకాహళపటహఝర్ఝరరవంబు। కాశినగరంబునఁద్రివిష్టపే
శునగరి। నవ్విహంగమరత్నంబులసుదినంబు॥ వ॥ ఇవ్విధంబునం బారావతస్త్రీ
పుంసంబులు సంసారసుఖంబులనుభవించుచు నొక్కనాఁడు త్రివిష్టపదేవభ
వనచంద్రశాలాగర్భవితర్దికానిర్వ్యూహవిటంకనీడంబునంగూడి మెలంగి యా
డుచుండ నొక్కశ్యేనంబుమిథునంబుదవ్వుదవ్వులంగనుంగొనిచేరవచ్చి జాల
కంబులలోనుండి తన్నునలవోకయుంబోలెఁగనుంగొనుచు దుర్గసమాశ్రియ
బలంబుననయ్యుగ్మంబు లెక్కసేయక యున్నయప్పటికినోడువుదప్పితోలంగి యె
క్కడికేనియుంబోయెఁ బరేంగితజ్ఞానచతురయగునప్పారావతిపతికిట్లనియె॥ సీ॥
మనపాలివేల్పువిత్తనియెఱుంగుదుగదా యెఱుఁగవో శ్యేనంబు హృదయనా
థ। ప్రబలమైనట్టిదుర్గంబులోనున్నార మగుటనేటికిఁద ప్పెఁబ్రాణభయము।
వైపుదప్పినమహాకోపంబుతోడనపోయె వైరంబాత్మఁబూనిదాయ । యెందు
చోటికినేగుటుచితంబుమనకింకవానికిన్కకునోర్చువారమెట్లు । చిచ్చువాతను
బరివాతఁజిక్కవశక । తప్పిపోయినవారలేలిజ్ఞులందుఁ। దాతకట్టినచెఱువంచుఁ
దగుసెమునుఁగ। నిల్లువిడువంగలేకచావేలమనకు ॥ చ॥ అనవినిపారువంబునవ
యౌవనగర్వమునంబడంతికి । ట్లనునిదియేమి నాబలపరాక్రమసంపదయింత
మాత్రమే । తనసరివారికిన్వెఱచిధామము పాడరఁజేసిడాగఁబో । యినసరి
యిండ్లవారుపగరేఖగమోయదియేమిదయ్యనో ॥ గీ॥ అదివిహంగమమేను
విహంగమంబ । పెసరగింజకుఁదక్కువే పెసరగింజ । యబలయటుచూడుమ
పక్షియువటడంతుఁ। గుటిలచంచూపుటీకోటికుట్టనముల ॥ వ ॥ అనినధర్మ
జయతియనుచుం బారావతియూరకుండ మఱునాఁడుతేపకడనాశ్యేనంబుద్రి
విష్టపేశ్వరునగరీప్రాసాదంబుమీఁద నిర్గమద్వారంబురోధించిపొంచియుండి
సంచారార్థంబుదిక్కులకువెడలునక్కులకవంబుల నుక్కుఁదండసంబువోని
ముక్కునసంకుశంబులంబోలుచరణనఖాంకురంబులం బట్టనుంబోలునుంగతి
చియుని జికియుంబట్టియేకాంతప్రదేశంబునభక్షించునదియై యుంతరిక్షంబున

దవ్వుగాఁగొనిచనియెనప్పుడు సేయునదిలేక కాందిశీకత్వంబునఁజిక్కువడియు
వివేకనిధియైనపారావతిపారువంబుదప్పుకఁ జూచి నయనసంజ్ఞంగాలుంగఱువు
మనిపలికిన॥ ఉ॥ శ్యేనముగాలిఁద్రవేలుగఅచ్చె దిటదప్పకిపారువంబులో। నూని
నతీవ్రవేదనకునోరువఁజాలకసత్క్రియానుసం। ధానముపాదధూనసముదత్స
మయంబునఁజేసెఁబత్రియా। మానమునందపారిరసమానరయంబునఁబక్షిదం
పతుల్॥ వ॥ పారియొక్కచోటంగూడిబలవద్విరోధంబునం జేసి కాశినుండ వె
ఱచి యయోధ్యానగరంబున సరయూతీరంబునం బెద్దకాలంబుమనువుమని
యపరజన్మంబునమందారవామకుండనువిద్యాధరుండును రత్నావళియను నా
గకన్యకయునై జన్మించి జాతిస్మృతివశంబునవప్పారువంబులు రెండునుదంపతు
లై కాలక్రమంబునఁ గాశీత్రివిష్టపేశ్వరుసేవించిముక్తులైరి దిత్రివిష్టపేశ్వర
మాహాత్మ్యంబు॥ గీ॥ ఆదిపరమేశ్వరుఁడుగౌరికానతిచ్చి। నట్టిపరిపాటిఁజెప్పె
దననఘునీకుఁ। గాశికేదారశంభులింగంబుమహిమ। సావధానతవినుమువింధ్యా
ద్రిదమన॥ వ॥ అనేకజన్మసంచితంబులైనపాపంబులు గేదారేశ్వరస్మరణంబు
నంబాయు సాయంప్రాతఃకాలంబులం గేదారేశ్వరస్మరణంబుసర్వదురితహా
రంబు॥ శా॥ ప్రాతఃకాలమునందుమర్త్యుఁడుహరుణ్ బాపాభిధానప్రహాద।
స్ఫీతఃపూరమునన్మునింగిపరమజ్యోతిర్మయంబున్మని। ధ్యాతవ్యంబునుశాశ్వ
తంబునగుకేదారేశలింగంబుసం। ప్రీతింజేరిభజించికాంచువిలతాభీష్టార్థసంసి
ద్ధులన్॥ వ॥ తొల్లిరథాంతరకల్పంబునందు వసిష్ఠుండనువిప్రుండు హిరణ్యగ
ర్భాచార్యువలనంబాశుపతదీక్షవడసి కేదారేశ్వరునిసేవించి ముక్తుండయ్యె
నెండియు॥ సీ॥ శిశిరభూధరకన్యచిఱుబంతిపసపాడు నెందుసాయంకాలమిం
పెలర్ప। నరుఁడందుజలముద్ధరణంబుసేవించిశంభులింగముదాల్చుజఠరపీఠి।
వినువీథిఁబోరాడివివశంబులైకూలిహంసంబులయ్యేవాయసములెందుఁ। బ్రవ
హించునెందుశ్రీభాగీరథికిఁబోటి యమృతప్రవాహ్వయమ్మైనతటిని। యదివి
ముక్తవధూకంఠహారతిలక। దివ్యకేదారలింగేశతీర్థభూమి। నదనదీవాగ్వి
పల్వలప్రహదసమగ్ర। ద్రాక్షవందిలికాశికోద్యానమునకు॥ వ॥ అందుగౌరీకుం
డంబు గౌరీతీర్థం బమృతస్రవాతీర్థంబు గలహంసతీర్థంబుమొదలుగా
ననేకతీర్థంబులుగలిగియుండుఁ గేదారేశ్వరంబునకుత్తరంబునఁ జిత్రాంగదే
శ్వరలింగంబు దత్సమీపంబునం గేదారేశ్వరస్థానంబు దక్షిణంబుననీలకంఠే
శ్వరలింగంబు నీలకంఠక్షేత్రంబునకువాయవ్యభాగంబున నంబరీషేశ్వరలిం
గంబు దత్సమీపంబుననింద్రద్యుమ్నేశ్వరలింగం బాదక్షిణంబునఁ గాళంజే
శ్వరలింగంబు చిత్రాంగదేశ్వరునుత్తరంబునక్షేమేశ్వరలింగం బది కేదారలిం

గమాహాత్మ్యంబుం బింక ధర్మరాజేశ్వరలింగమాహాత్మ్యంబు వివరించెద॥ గీ॥ అనినఁ బ్రియమందినై మిళమునిగణంబు। సూతునర్చించి భక్తిసమేతమగుచు। ధర్మరాజేశశివుమహాస్థానమహిమ। గుహుఁడు సెప్పినవిధమునఁ గుంభజునకు॥ వ॥ అవ్విధంబు మాకానతిమ్మనుటయు॥ శా॥ కల్పాంతానిలఘూర్ణమానజలముం గర్జానినాదోద్భవా। నల్పాటోపకఠోరఘాటిపటహారావద్యభ్రష్టోపవిధ్వస్తసం। కల్పారాతినృపాలసంశ్రితకులక్ష్మాభృద్గుహాగేహయా। కల్పక్షామపటీరహీరహిమవాక్కాశ్మీరచంద్రద్రవా॥ క॥ వీరావతారవితరణ। పారాయణహృదయరాజపరమేశ్వరది। గ్వారణకరిసన్నిభభుజ। ధారాసురదానదర్పధరణీధ్రపతీ॥ మాలిని॥ ధరణిభరణహేలాధఃకృతక్రోడలీలా। జరఠకమఠభూభృచ్చక్రచక్రేశ్వరాశా। ద్విరదనివహకుంభద్రీఘ్నదోస్తంభయుగ్మా। భరితగుణదిలీపా పంటవంశప్రదీపా॥

గద్య॥ ఇది శ్రీమత్కమలనాభపౌత్ర మారయామాత్యపుత్ర సుకవిజన విధేయ శ్రీనాథనామధేయప్రణీతంబైన కాశీఖండంబను మహాప్రబంధంబునందు షష్ఠాశ్వాసము సమాప్తము.

---

శ్రీ ర స్తు.

## కాశీఖండము - సప్తమాశ్వాసము.

శ్రీరాజరాజకరుణా। ధారధరాభరణకరణధౌరంధర్యా। స్ఫారభుజార్గళభక్తిస। మారాధితభుజగహారయళ్ళయవీరా॥ వ॥ అక్కథకుండు శౌనకాది మహామునులకిట్లనియె॥ గీ॥ ద్రుఢవివేకధర్మేశ్వరతీర్థమహిమ। యబ్జజునకైనవర్ణింపనలవియగునె। యమ్మహాక్షేత్రమునను న్న యండజములు। బ్రహ్మవిజ్ఞానవాసనాప్రవణమతులు॥ వ॥ కాశీమధ్యంబున నఘ్యర్ఘ్యమణినిర్మితంబై మోక్షలక్ష్మీవిహారస్థానంబై సముత్తంభితశాతకుంభమండలీమండితసుధాధవళసౌధవీధివిభ్రాజితంబై యవతరణరభసశీర్ణస్వర్ణదీస్రోతశ్శైలాకానుకారిపుంగవపతాకాలంకృతంబై గవాక్షవివరోద్గీర్ణ గుగ్గులు మహీసాక్షిధూపధూమరేఖాస్మారితస్మరహరకంఠమూలకఠోరకాలకూటవిషచ్ఛాయాచ్ఛటగుళుచ్ఛంబై యుండుముక్తిమంటపంబున ముక్కంటి మధ్యాహ్నకాలంబున బ్రాహ్మణవేషంబున వైశ్వదేవబలిహరణంబులు సేయుమహాప్రసాదంబునకు నింద్రదిగ్భాగంబున జ్ఞానమంటపంబునందు బాలేందుధరుండు దక్షిణామూర్తిస్వరూపంబు ధరియించి బ్రహ్మములకు జ్ఞానోపదేశంబు సేయుఁ దత్ప్రాం

తంబునవిశాలాక్షిహర్మ్యంబునందునుప్రతివాసరంబునుగుతపకాలంబునందు॥
సీ॥ పసిఁడికమ్ములతోఁడికుసుమపూవన్నియనిద్దంపుఁబుట్టంబు నెఱియఁగట్టి। యిం
ద్రనీలములతో నెడకట్టిగ్రుచ్చినరమణీయతారహారముధరించి। పారిజాతకతరు
ప్రసవగర్భితమైనకబరిపైఁజెంగల్వకచ్చువిలిపి। ఫాలభాగంబునఁబన్నీరుమెది
చినకమ్మకస్తూరితిలకమ్ముదీర్చి। వలుదచన్నులజిలుగుకంచులికఁదొడిగి। కటి
భాగంబునవజ్రజాలకమరుదాల్చి। యరసియాఁకొన్నవారికినమృతభిక్షఁ। గరుణ
నిచ్చుశ్రీవిశాలాక్షి కాశియందు॥ వ॥ విశాలాక్షి పీఠస్థానంబునకుసమీపంబునఁ
జక్రపుష్కరిణీతీర్థంబు॥ గీ॥ భవ్యతరనిష్ఠనుభయదర్భలునుదాల్చి। సంధ్యవా
ర్చుచుఁజక్రపుష్కరిణియందు। ఫాలనేత్రుండుదారకబ్రహ్మమంత్ర। వర్ణ
కర్ణేజపుఁడుప్రతివాసరంబు॥ వ॥ ఆతీర్థంబునకుసమీపంబునరత్నేశ్వరలిం
గంబు దత్సమీపంబున వృషభధ్వజలింగంబు తత్సమీపంబున నాదికేశవపీ
ఠంబు తత్సమీపంబునంబంచనదతీర్థంబు తత్సమీపంబునఁ బంచముద్రమ
హాపీఠంబు తత్సమీపంబునపీఠేశ్వరలింగంబు తత్సమీపంబునసిద్ధేశ్వరపీఠం
బు తత్సమీపంబునయోగినీపీఠంబు॥ గీ॥ కలవుపీఠంబులానందకాననమునఁ।
జెట్టుప్రేసినఁజేకుఁడక్షీణపుణ్య। యర్థవాదంబుగాదుసత్యంబకాని। పెద్దపీఠం
బుధర్మేశపీఠకంబు॥ క॥ విశ్వభుజాగౌరీపర। మేశ్వరిసేవించియుందునింద్రాణి
సమ। గై శ్వర్యముసౌభాగ్యము। శాశ్వతముగభర్తసంప్రసాదముఁగాం
చెఁ॥ వ॥ విశ్వభుజాదేవిమనోరథతృతీయావ్రతంబుననారాధించి శచీదేవి
యింద్రుని నరుంధతివసిష్ఠు ననసూయయత్రిని సునీతియుత్తానపాదుని భర్త
లంగావరంబువడసి రీవిశ్వభుజాదేవిసమీపంబున నాశావినాయకుండు పరిణ
తాఖిలభక్తమనోరథసిద్ధిదాయకుండై యుండు॥ గీ॥ వృత్రవధసంభవంబైన
వృజినమునకు। శాంతిగాఁగాశికాపురిజంభభేది। ధర్మపీఠంబునకునుపాంతంబు
నందు। నిష్ఠతోశంభులింగప్రతిష్ఠసేసె॥ వ॥ ధర్మతీర్థంబుబ్రహ్మహత్యాదిపా
పంబులపనయింపంజాలు నిందేశ్వరుండుదారకేశ్వరునకుఁబశ్చిమభాగంబున
శచీశ్వరుండును నింద్రేశ్వరుంబరివేష్టించి లోకపాలేశ్వరులును ధర్మేశ్వరున
కుంబశ్చిమభాగంబునఁనూర్వశీశ్వరుండును దారుకేశ్వరునకు నాలుగుదిక్కుల
దత్తేశ్వరవైరాగ్యేశ్వర జ్ఞానేశ్వరైశ్వర్యేశ్వరులు నుంద్రు గదంబశిఖరంబను
వింధ్యపాదంబునదమునికొడుకుదుర్దముండనువాఁడుదురాచారుండై యొక్క
పురుషువలనజ్ఞానోపదేశంబువడసికాశికింజనిలింగప్రతిష్ఠసేసి నాదుర్దమేశ్వరు
భజించువారలకు భోగమోక్షప్రదాయకుండై యుండు నమిత్రజిత్తనురాజు
విష్ణుభక్తిపరాయణుండు నారదునుపదేశంబువలనఁగాలకేతుండనురాక్షసు

నిచేతనపహరింపంబడి పాతాళలోకంబునంజంపకావతియనుపట్టణంబుననుం
డిమలయగంధియనువిద్యాధరకన్యకం బెండ్లియాడి యానందకాననంబునకరిగి
విశ్వేశ్వరదేవిదివ్యలింగస్థాపనంబునందునకాంతిమనోరథతృతీయావ్రతంబు
నోమించిపుత్రవంతుండయ్యె॥ గీ॥ మరిహయగ్రీవతీర్థంబుమానివర్య। కాశికా
తీర్థములలోనఘనముమహిమ। నంతకంటెనుగజతీర్థమభ్యధికము । ప్రధిమం
గోలావరాహతీర్థంబునట్లు ॥ వ॥ దిలీపతీర్థంబు సప్తాభితీర్థంబు హంసవ్యాఘ్రే
శ్వర ముకుంద పృథు పరశురామ బలభద్ర దివోదాస హరంపాశతాశ్వమే
ధ బందిశుక్ర భవానీ ప్రభాస గరుడ బ్రహ్మ వృద్ధార్క నృసింహ చిత్రరథ ధ
ర్మ విశాల లలితా గౌతమ గంగా కేశవ నర్మదా వసిష్ఠ మార్కండేయ భా
గీరథీ ఘుంకర్ణాదితీర్థంబులివి మహాపుణ్యతీర్థంబులు ॥ గీ॥ ఇపుడుచెప్పిన
తీర్థంబులెన్నిగలవు । వీనినన్నిటిరాశిఁగావించియందు । మూఁడుకోటులు
శివలింగములనునిలుప । నీసమష్టివీరేశ్వరునెనయలేవు॥ గీ॥ అర్థిఁజేతీర్థమునఁ
దీర్థమాడనెవ్వఁ। డతనికాతీర్థమాడినయంతఫలము। అనఘువీరేశతీర్థమాడిన
నరుండు। గాంచునిశ్శేషతీర్థావగాహఫలము ॥ గీ॥ మలయగంధితనూజుండుక
లశజన్మ। వీరుఁడనువాఁడువాఁడు సేవింపఁబట్టి। యుర్వీశిపునకువీరేశుఁడనెడు
నామ। మనఘయానందకాననాభ్యంతరమున॥ వ॥ మఱియుసంగమేశ్వరతీర్థం
బు పాదోదకతీర్థంబు క్షీరాబ్ధితీర్థంబు శంఖతీర్థంబు మఱియుఁ జక్రపద్మగరు
త్మద్వైకుంఠ నారదాంబరీష దివ్యకేశవ దత్తాత్రేయ భాగవత వామన నీల
గ్రీవోద్దాలక నరనారాయణ యజ్ఞవరాహ విదారణ నరసింహ లక్ష్మీనరసిం
హ గోపీ గోవింద శేష సాంఖ్య మహిషాసుర బాణ వైతరణీ ప్రణవ పిశంగి
లా పిలప్పిలా నాగేశ్వర కర్ణాదిత్య భైరవ ఖర్వ నృసింహ పంచనదతీర్థంబు
లివిమహాతీర్థంబులు భోగమోక్షప్రదంబులు॥ స్రగ్ధర॥ ఆనందారణ్యపూర్వా
ర్ధ్యమునఁగలవుకోట్లర్బుదన్యర్బుదంబుల్ । నానాముక్తిప్రదంబుల్ నలినజము
రభిన్నాకరాద్యర్చితంబుల్ । స్థానంబుల్ గల్గునీపంచనదమున మహాశంభుతీ
ర్థంబుతోడన్। వానిన్ సామ్యంబు సేయన్ వలదు బహులనిర్వాణలక్ష్మీసమృ
ద్ధిన్॥ వ॥మఱిజ్ఞానప్రసాదతీర్థంబు మంగళతీర్థంబు మయూఖాదిత్యతీర్థంబు మఖ
తీర్థంబు బిందుతీర్థంబు పిలిప్పిలాతీర్థంబు మఱియు వరాహమరుదీశ్వర
మిత్రావరుణాగ్న్యంగారక కాలచంద్ర విఘ్నేశ్వర హరిశ్చంద్ర పర్వత కంబ
ళాశ్వతర సరస్వత్యుమాభామ మణికర్ణికాతీర్థంబు లివితీర్థోత్తమంబులు ॥
గీ॥ వింటివీవుతీర్థంబులు వేనవేలు । కలశసంభవ చెప్పితిఁగారవమున । హె
చ్చుగుందాడదగవుగాదిల్వలారి । యన్నిటికిఁబెద్దమణికర్ణియనియెఱుంగు ॥

గీ॥ అనిదశాశ్వమేధమగ్రంబుతీర్థంబు। పంచనదముగాఁబసగలయది। వాని
కంటెఁ బెద్దవాతాపితాపన। చక్రపుష్కరిణియసంశయంబు॥ వ॥ ఇంకదుశ్వా
సోంగమాహాత్మ్యంబువినుపించెద నాకర్ణింపుము॥ గీ॥ సకలదేశంబులందు
నుసంచరించి। ఋషివరేణ్యుఁడుదూర్వాసుఁడేగుదెంచె। నఖిలము క్తివధూవి
హారావరోహ। సౌధవీథికిఁగాశికాస్థానమునకు॥ వ॥ ఇట్లువచ్చియమ్మహాభాగుం
డుభాగీరథీనదీమాతృకంబులై ముక్కారునుబండు పంటవలంతి కేదారక్షే
త్రంబునిర్ధౌతకలధౌతశలాకాశకలశంకనంకురింపఁజేయుఁజాలు క్రొత్తమొల
కలెత్తునవియును సుకుమారశుకచ్ఛదచ్ఛటాచ్ఛాయాదంబులై యడ్డపచ్చ
గొనునవియును నార్యావర్తదేశమత్తకాశినీజంఘాకాండ పాండిత్యంబుగం
డూషించుచిగురుపొట్టలఁగనుపట్టునవియునుబదియాఱువన్నెకడానికుందనం
బు హెచ్చుకుందాడు పసిమిఁబచెల్లిమంబులగు నవియునైన పాసుఁగుంజేలు
ను వికటఘటీయంత్ర వ్రాతవాపికాసలిలధారాధోరణీ ప్రవాహసేక సంవ
ర్ధితంబులై జంబూజంబీరనారికేళ సహకారకురువకవకుళాశోక శాకోటకు
టజముఖనిఖిలవిటపివాటికాభిరామంబులైన యారామంబులును సముద్దండ
పుండరీక కువలయకుముదషండమండితంబులగు తీర్థకుండంబులును నారసా
తలగంభీరసలిలసంభారంబులయిన పరిఘాచక్రంబులునుగనకగిరిప్రదీప్రవప్రా
కారంబులగు ప్రాకారంబులునుం గనుంగొనుచు భూర్భువస్స్వర్మహాలింగమ
కుటగంగాతరంగకూటకోలాహలవ్యాజృంభితసముత్తంభితశాతకుంభ సౌధభ
వనచంద్రశాలావలభీగర్భక్రోడంబులను ఖషోల్కాదిత్యప్రత్యగ్రకిరణకందళీసం
దోహస్పందకందళితమందాకినీకనకారవిందకాననంబును జేగిమవ్యేశ్వరభూ
షాభుజంగభూత్కారపవనధారాతరంగితోత్తుంగపుంగవ పతాకాకౌశేయప
ట్టపటీవల్లీ వేల్లితనభోంగణంబును వికటదేవీకరకఠోరడమరుఢాంకార బృంహి
తబ్రహ్మాండమండలంబును ద్రుమిచండవతీకళాకంఠ మూలకాకోల విషమ
షీవిసృత్వరాంధకారచ్ఛటా సంఘాతజ్యోతిరింగణాయమాన శశివతంసమండ
లంబును మాహేశ్వరీవాహనవృషలంబకగళకంబళకషణ మసృణత్వక్ శా
ఖాస్కంధపరిణాహ బంధురావరణా సింధురోధః ప్రత్యాసన్నచైత్య ద్రుమం
బునుదుంఠిరాజశుండాకాండచుళికితోన్ముక్తజ్ఞానవాపికాసలిల నిర్ఝరఝ
లాంతరితంబును గ్రోధభైరవప్రబలహుంకారకఠినతరకహకహాట్టహాసముఖ
రిత పాకారగోపురాట్టాలకంబును గర్మబీజంబులకునూషరంబును బుట్టువుల
కువీఁకకోలును గల్మషంబులకుఁ గర్తరియును మంగళంబులకునాస్పదంబు
ను గైవల్యంబులకుఘంటాపథంబును జ్ఞానంబులకుఁ దానకంబును విర క్తికి

నెలవును విభవంబులకుఁ బ్రభవభూమియు విలాసంబులకు నివాసంబయిన కాశి
కాపట్టణంబుఁ బ్రవేశించి॥ గీ॥ తపసి కొన్నియుఁగాలంబు దపము సేసి। కాలగళుపీ
ఠ నాటెంద కాననమున। ఫలము గడుదూరమైనఁ గోపంబు పుట్టి। కాశినగరంబు శ
పియింపఁ గాఁదలంచె॥ అప్పుడు ప్రత్యక్షంబై॥ చ॥ కహకహన వ్వెదంపి ప్రికిలగ
ల్లమెఱుంగులు భానుదీప్తిసం। గ్రహము దిరస్కరింప శితికంఠుఁడు కుంతితరోషదీ
ప్తుఁడై। యహహ దురాత్మ కాశిపయిన ల్గెదవే యనుపల్కుపల్కునా। గ్రహ
మున నేను డుంఠిగణరాజును దేర్చితి మమ్మునీంద్రునిన్॥ అప్పుడు॥ సీ॥ నంది షే
నువిలోచనములనిప్పులు రాలె శూలంబు చేనం దెసోమనంది। మృత్యు ప్రకంప
ను మేనెల్లఁ జెమరించె దండుఁడాస్ఫోటించె ధరణిఁ గాలఁ। గుంభోదరుండు భ్రూ
కుటిఫాలమునఁ బూనెఁ గోకిలాక్షుఁడు పండ్లు గొరికికొనియె। నగ్నిజిహ్వుండు
ఘోరాట్టహాసము సేసెఁ గృత్తివాసుండు హుంకృతియొనర్చె। భృంగిరిటుండు
లు తాండవప్రియుఁడు రేఁగి। డమరుకంబులు వాయించి రమితపటిమ। రాజశేఖా
ధరుండు దుర్వాసు మీఁదఁ। నలుగు బెత్తెఁగి తదీయరోషానువృత్తి॥ శా॥ అభ
గ్నభ్రూకుటీకరాళముఖులై యంగంబులుప్పొంగ దా। వాభూమ్యంతరమట్ట
హాసడమరుధ్వానంబులన్ బిట్టుసం। క్షోభింపం బ్రమదధ్వజవ్యధిపతుల్ కుంభోద
రాదుల్ మహా। భూభృత్సన్నిభులం ఘుర్లన్ ధరణియాస్ఫోటించి తాటించు
చున్॥ క॥ జడముడులు జటిల భృకుటులు। ముడివడఁగనుఁగవలఁ గెంపు మొల
తేరంగా। మృడు ప్రమథులు పులితోలుం। గడవసములు మడిచికొనుచుఁ గడు
రభసమునన్॥ ఉ॥ చంపుదు మేకృతాంతు శిఖిచండ మయూఖుల బారిఁ గొందు
మే। దంపుదుమే కుభృత్పరివృఢంబుల మొత్తుదుమే యజాండమున్। జింపుదు
మే చతుర్దిశలు జృంభిత బాహుపరాక్రమక్రియా। సంపదసొంపుమీఱఁ బురశా
సను నానతియింతిగల్గినన్॥ అని వెండియు॥ గీ॥ మాటిమాటికిఁ గోపసంభ్రమము
పేర్మిఁ। గక్షపాత్రంబులందున్న గమ్మభూతి। వదనముల బ్రామికొనుచు నిర్వ
క్రలీల। హరహరా యనిపల్కిరి యభ్రమడల॥ వ॥ అప్పుడు దుర్వాసుండు శ
ర్వాణీపతికి దండప్రణామం బాచరించి తలవకారముండక ఛాందోగ్య శ్వేతా
శ్వతరాద్యుపనిషదర్థగర్భితంబులైన బహువిధస్తోత్ర సందర్భంబుల నమ్మహా
దేవుం బ్రస్తుతించె శివుండును బ్రసన్నుండయి యమ్మునీంద్రునకుం గోరిన వ
రంబులొసంగి యంతర్హితుండయ్యె ననంతరంబ॥ గీ॥ అమ్మునీంద్రుఁడు దన
పేరనధికభక్తిఁ। గాశియందుఁ బ్రతిష్ఠించెఁ గాలకంఠు। దివ్యలింగంబు భాగీర
థీతటంబు। నందు మణికర్ణికాతటోపాంతభూమి॥ వ॥ దుర్వాసోలింగంబు సర్వా
భీష్టఫలదాయకంబు మరి విశ్వకర్మేశ్వరలింగంబు ప్రాదుర్భావంబు వివరించెద

సావధానమతి వై యాకర్ణింపుము త్వష్టప్రజాపతికొడుకు విశ్వకర్మ బ్రహ్మచ
ర్యంబున భిక్షాన్నభోజనుండై గురుకులంబున విద్యాభ్యాసంబు సేయుచుండె
నంత॥ సీ॥ వానకాలమువచ్చె వర్షంబులందందు జడిపట్టికురిసె నాశ్రావియం
దు। గురుఁడు నాకొక్క మందిరము నిర్మింపుము నుదకధారల చేత నురవకుండ।
గురుపత్ని నాకొక్క కంబుసంబు కుట్టుము చలిగాలి యొడలిపైఁ బొలయకుండ।
గురునందనుండు నాకురచింపు పాదుక లడుసు పాదంబులం దంటకుండ। గురుత
నూభవ నాకు బంగరువు తొడవు। వజ్రభూషలు సేయు తాల్పంగవలయు। నను
చుంబార్థించిరందఱికతఁడు మొక్కి। యిన్నియును దానుగల్పింపనియ్యకొ
నియె॥ వ॥ ఇవ్విధంబున గురునకు గురుపత్నికి గురుపుత్రునకు గురుతనూభవకు
వారలుగోరినయర్థంబులు సంఘటింపనను వెఱుంగక చింతాక్రాంతుండై దై
వయోగంబున నొక్క పుణ్యపురుషును పదేశంబున గాశికరిగి శివలింగంబు ప్రి
తిష్ఠించి పరమనిష్ఠం బెద్దకాలంబు తపంబాచరించిన ప్రత్యక్షంబై విరూపా
క్షుండనుగ్రహింప సర్వధాతువులకు సర్వదారువులకు సర్వశిలలకు సర్వమ
ణులకు సర్వరత్నంబులకు సర్వపుష్పంబులకు సర్వవస్త్రంబులకు సర్వసు
గంధంబులకు సర్వకందమూలఫలంబులకు సర్వచక్రంబులకు దానకర్త
యగునట్లుగా వరంబు వడసి గురుజనంబుల యాజ్ఞ చెల్లించి విశ్వోపకార
పరుండయ్యె నతని పేరఁ గాశివిశ్వకర్మేశ్వరుండు విశ్వాభీష్టఫలప్రదాయకుం
డై యున్నవాఁ డింక దక్షేశ్వరలింగంబు ప్రాదుర్భావంబు వివరించెద॥
ఉ॥ సామజదైత్యశాసనుఁడు సారసగర్భుఁడు నచ్యుతుండును। ద్రామముఁడు నా
దిగాసురకదంబము గొల్వన శేషలోకరా। జామహనీయతారరజతశైలముపైఁ
గొలువుండె శుద్ధము। క్తామణిభూషితంబైన కాంచనరమ్యశిలాతలంబునన్॥
తదనంతరంబ॥ గీ॥ వేలుపుల నెల్లఁ బరిపాటిపిలుకొలిపె। సముచితంబైన తార
తమ్యమున శివుఁడు। మఱి చెదక్షప్రజాపతిమామననుప। నట్టివారికి మ్రొక్కు లే
డెట్లొకపుడు॥ వ॥ అన్నంబై యతండును మరలి నిజస్థానంబునకుం బోయి నిజాం
తర్గతంబున॥ సీ॥ ఇతనివంశం బెద్ది యెఱుఁగంగవచ్చునె యితనిగోత్రంబెవ్వఁ
డెఱిఁగినాఁడు। దేశంబు గుఱుతు సాధింపంగవచ్చునె వర్తనం బెఱుఁగంగవచ్చు
నెట్లు। వృషభవాహనుఁడఁట విషము దిన్నాఁడఁట యితనిసమాచార మేమి తె
న్న। యస్త్రంబు ధరియించునఁట తపస్వియునట్టె యిట్టి వేడబము లెయ్యెడలగల
వె। కాశిలోనుండు గాహర్షస్థ్యగణనయెట్లు। బ్రహ్మచారియు గృహియు నెబ్భం
గినయ్యె। శూద్రుఁడో బ్రాహ్మణుండో వైశ్యుండొ రాజొ। తెలియవచ్చునె
యీతనికల తెఱంగు॥ వ॥ అర్ధనారిగావునం బురుషుండుగాఁడు గడ్డంబు గలిగి

నకతంబున యోషగాదుసమర్చనీయలింగమూర్తియగుటనపుంసకుండుగాఁ
డు పెద్దకాలంబువాఁడుగావున బాలుండుగాఁడుచిరంతనుండుగావునఁదరుణుం
డుగాఁడు-జరామరణవర్జితుండగుటవృద్ధుండుగాఁడుమహాకల్పాంతంబునంబ్ర
హ్మాదుల సంహరించియుం బాలకీనాఁడితని చందంబెవ్వండెఱుంగు నది యె
ట్లుండె॥ క॥ మామగుగుస్థానంబున। సామాన్యుఁడ నెట్లుజలజసంభవసుతుఁ
డ। సౌముఖ్యంబున యోగ। క్షేమములారసిప్రియంబు చెప్పందగు నే॥ క॥ మా
తాపితృవర్జితుఁడగు। నీతనికిని నెట్లుబిడ్డనిచ్చితినా దీ। నాతప్పగాక యిదిదా।
నీతనిత ప్పెట్లునాకునిటు కావలయు॥ గీ॥ పెద్దలయ్యనుగడుబిఱ్ఱబిగిసియుండు।
నట్టియభిమానములనుగర్వములఁబట్టి। యెల్లవారికి నెట్లనీయువగుణంబు। వెన్న
తోఁ బెట్టినదియింతివిసువనేల॥ గీ॥ అహాహాయలచంద్రుఁడనువాఁడహంకరిం
చి। రోహిణీదేవినొల్లకరోసియుండ। బాతినతనిక్షయవ్యాధిబాధితుఁడుగఁ।
గినిసిశపియింపనేవల్లఁగనిననోర్వ॥ క॥ ఇదిధర్మంబకుపీనుల। కిదివిధిమాతాపి
తృప్రహీనులకహహా। యిదికట్టడతిరుపరులకు। నెదిరించనునెఱుఁగకునికికే
లామాటల్॥ శా॥ తానెట్టేనిదిరస్కరించెననునాస్థానంబునందేవతా। మాని
వ్రాతములోనమామయనుసన్మానంబుశూన్యంబుగా। నేనుందన్నుఁదిరస్క
రించెదమఘంబిప్పాటఁగల్పించినం। ధ్యానైయత్యముఁబూనియల్లుఁడనుసన్మా
నంబుశూన్యంబుగ॥ వ॥ అనియజ్ఞసంభారంబులొడంగూర్చి యజ్ఞపురుషుం
డైన పురుషోత్తముండుపద్రష్టగా బ్రహ్మవాదులగుమరీచ్యత్రిభరద్వాజాదిస
ప్తర్షులు ఋత్విజులుగాఁద్రైలోక్యంబును దక్షిణాద్రవ్యంబుగా భృగుండుబ్ర
హ్మగానాంగీరసుండాచార్యుండుగా భగపూషాదులుసదస్యులుగాదిక్పాలకు
లురక్షకులుగానట్లురుధర్మంశునుజంద్రుండును గశ్యపుండునుసహాయులుగాఁ
గామధేనువుహవిస్సునుగల్పవృక్షంబులు సమిత్కుశంబులును విశ్వకర్మదా
రుపాత్రశకటమంటపాలంకారంబులు గల్పించువారుగా ధర్మపత్నియగు శత
రూపాదేవితోఁగూడిమహాధ్వరము సేయం బ్రారంభించిన॥ గీ॥ అరణిసంగ్ర
హామొనరించియజునిపట్టి। పెద్దకొలువుండెముత్యాలగద్దెయెక్కి। చుట్టుబలిసి
కూర్చుండిరిసురలుమునులు। వింధ్యమాఁకిడినేట్లుండె విశ్వసభయు॥ వ॥ అప్పు
డుపరమమాహేశ్వరుండుదధీచుండును విప్రర్షిసభామధ్యంబుననిలిచియెల్లవా
రునువిననిట్లనియె॥ సీ॥ భారతీదేవికై వారవాక్యంబులు పఠియించుచున్నదిప్ర
స్ఫుటముగ। నాచార్యపదవికినర్హమైనాయితండై యున్నవాఁడు చతురాననుఁడుం
డు। కర్మకాండవిమండుగాచియున్నాఁడుబ్రహ్మత్వమునకుక్షణంబందిభృగుఁ
డు। గట్టువాలై లక్ష్మినై సేయుచున్నదిచేరియంతఃపురస్త్రీజనములు। దేవిశత

రూపచాలమెదిర్చెహాని। నీవుదీక్షివ్యమానుండవిద్ధమహిమ। సర్వగారంభ
ము౯తొప్పునయ్యదక్ష। శివునిఁదో స్త్రైవియొక్కయొక్కెంబకాని॥ క॥ అపరా
ధమిఁక నెట్టిది। నెపుడాముఖమునకుఁదన్నుఁజీరినమాత్రం। త్రిపురాంతకుఁబిలి
పింపక। యుపదర్శనమాచరించుటుచితమెహారికి॥ క॥ వామాంగమునైకుం
ఠుఁడు। వామాంగము వేధమదనవైరికినని యో। సోమ పయోజగుఁదోయెటుఁ
గవా। యామృడురప్పింపవలదె యధ్వరమునకు౯॥ సీ॥ శితికంఠునకును నెచ్చె
లికాఁడుగాఁడకో యటమటీఁడైనయాయక్షభర్త౯। యహికంకణునకుమాఁ
డవకన్నుగాఁడొకో పాల్మాలునట్టియాపావకుండు। పురవైరికవలంసప్పంబు
గాఁడొకో నిర్భాగ్యుఁడైనయానీరజారి। గంగాధరునకు లెంకల లెంకగాఁడొ
కో పెనుగూళయైనయాయనిమిషేంద్రుఁ। డేమిగుడువంగవచ్చినా రిండ్లువిడి
చి। హరుని వెలివెట్టినట్టియాయాగమునకుఁ। బంచవదనునికను జేవురించె నేని।
దక్షణమునందతమయాంద్రతాళిళ్ళుదెగవె॥ గీ॥ ఏలవచ్చినవాఁడు బాలేందు
మౌళి। విరహితంబైనయాయాగవిధికి జముఁడు। మఱచెనే శూలిడాకాలిమడమ
తాఁపు। దీర్ఘనిర్ఘాతసంఘాతనిర్ఘృణుంశు॥ క॥ వినకే శ్వేతాశ్వతరోపని
షత్తు హరుండుభోక్త భర్తుఁడుభోగ్యం। బనిలాశిధరుఁడుపీరితి యనిచెప్పెనొ
లేదోయద్రిప్రయత్నముతోడ౯॥ వ॥ వియదాదిపరమాణ్వంతంబైన చరాచ
రాత్మజగత్ప్రపంచంబునకు సృష్టిస్థితిలయకారణంబైన శంభుండు నీకుమానసీ
యుండుగా కుండుటయెట్లు విచారింపుము। గీ॥ బ్రాహ్మణుఁడనాశ్రితుఁడ నీకుఁ బర
మహితుఁడ। దక్షనెుక మాటవినవయ్య తగవుగల్గి। క్రతుఫలాధీశు భువనరక్షాధు
రీణు భోగకంకణు రప్పింపు యాగమునకు॥ వ॥ అర్థహీనంబైన వాక్యంబును గర్భహీ
నంబైన శరీరంబును బతిహీనంబైన నారీరత్నంబును గంగాహీనంబైన దేశంబు
ను బుత్రహీనంబైన దాంపత్యంబును దానహీనంబైన వైభవంబును మంత్రిహీ
నంబైన రాజ్యంబును శ్రుతిహీనంబైన యాకారంబును యోషాహీనంబైన సౌ
ఖ్యంబును దర్భహీనంబైన సంధ్యావందనంబును దిలహీనంబైన పితృతర్పణం
బును హవిర్హీనంబైన హోమంబును శివహీనంబైన క్రియాకలాపంబులు నిర
ర్థకంబులు॥ గీ॥ అనినఁగోపించి దక్షుఁడీయవనిసురుని। వెడలఁద్రోయిఁడు ప్రా
గ్వంశవేశ్మమునఁగ। దనకుఁదాననడచుచునాస్థానమెల్లఁ। దల్లడిల్లంగ వెడలె
నుద్దామభంగి॥ వ॥ అతనితోడదుర్వాసుండును దధీచుండును నుపమన్యుండును
రుచికుండును గాలవుండును మాండవ్యుండును వామదేవుండును నుద్దాలకుండు
ను వెడలిరంతకమున్న దిగాఁ జెత్తింగి బ్రహ్మసత్యలోకంబునకరిగె. ముఖంబు ప్రా
రంభింపంబడియెఁదద్వృత్తాంతంబంతయు నారదువలన విని సతీదేవి మహేశ్వరున

సుమతివివ్యక్తథాహూఢయై తండ్రికిబుద్ధిచెప్పఁబోఁ గైలాసంబునుండియే
తెంచి॥ గీ॥ యజ్ఞవాటంబుసొత్తెంచి యఖిలజనని। యర్ఘ్యఁగూర్చుంజరత్నసిం
హాసనమున। భక్తితో దేవసభయును బ్రహ్మసభయు। నంజలులు ఫాలభాగం
బునందుఁ గూర్చ॥ వ॥ అప్పుడు దక్షప్రజాపతికోపించి కూఁతుచిత్తంబెఱింగి యి
ట్లనియె॥ సీ॥ హరుఁడమంగళవేషుఁడౌఁగాఁడో చెప్పుమా యెఱుఁగకిచ్చితిమి
నిన్నేమి చెప్పు। నిటుచూడుమిందఱునింతొప్పియున్న వారఖిలభూషణభూషి
తాంగులగుచుఁ। దనరూపునకుఁ దోడు దలముదప్పినగర్వ మరగంటఁ జూడఁ
డేయురిగినపుడు। నాపెండ్లికొడుకులందే పాటివాఁడుదా నేసేలరప్పింతునిట్టివా
ని। నీవువచ్చితిమేలయ్యెనిదియుచాలు। నతఁడురాకున్నఁగొదలేశమైన లేదు।
దానుభిక్షాకపాలంబు దాల్చివచ్చి। బంధుసేయుటకంటె రాకుండుటయును॥
అనినవినిసతీదేవితండ్రికిట్లనియె॥ శా॥ ఆహా లెస్సవివేకమేపురహరుండాసించి
యున్నాఁడెసి। స్వాహాకారముశంభుఁబాసియిటనీసత్రంబునం దేనుమ్మ్యా। స్వా
హారంబుభుజింపవచ్చితిని నే మోహాంధుండవై యీశ్వర। ద్రోహంబే టికిఁజేసె
దంచుహితబుద్ధుల్సెప్పఁగావచ్చితిన్॥ గీ॥ శివుఁడుదాతభోక్త శ్రీమహాదేవుం
డు। సర్వమునుహరుండు శాశ్వతుండు। శంభువేఱుసేసిసాగింపవచ్చునే క్రియ
లువెట్టి వేలయయితిచెపుమ॥ దండకము॥ వినుమతఁడుసదానిధిధ్యాసితవ్యుం
డుమంతవ్యుఁడాతండుశ్రోతవ్యుఁడాతండు ద్రష్టవ్యుఁడాతండు జన్మస్థితిధ్వంస
నంబుల్ దిరోభావ మోక్షంబులుం గృత్యముల్గాఁగనాతండు లోకంబులుం
బట్టిపాలార్చురుద్రుండు విశ్వాధికుండంచు నామ్నాయసంఘాత మామ్రేడి
తప్రక్రియందోయమై యాతని జెప్పు సత్యంబు నిత్యంబు శుద్ధంబు బుద్ధంబ
నంతంబు శాంతంబు కూటస్థ మాత్మప్రతిష్ఠంబఖండంబు సత్తద్వితీయంబు చి
త్తేశమానంద మాద్యంబవేద్యంబు దిగ్దేశకాలవ్యవచ్ఛేదనీయంబు బ్రహ్మం
బుదత్త్వమ్ముల్ వేదవేదాంతవిద్యామహావాక్యమీమాంసహంసుల్విచా
రింతురధ్యాత్మయోగంబునన్ పణ్ణవత్యంగుళీమాన యుగేహమధ్యాంతరా
ళానలావాసకోణత్రయీగేహ మోహాత్ప్రభాలేఖ కాస్యూతనిర్భిన్నషట్ప
ద్మకారీగర్భవిష్కంభ నిష్కంపనీవారశూకోపమాధామ ధామచ్ఛటాకోటి
శంపాల తాలంఘిత ద్వాదశాంతేందు నిష్యందమానామృతాసారధారాప్ల
వాస్పందితానందులై యోగిబృందారకుల్ లీలతోలోనఁగండ్రిట్టినిక్క
మైయాతఁ డొక్కండ భూతాత్మభూతంబు నందుండి నానాత్వముంబొందిన
ట్లుండు నెట్లు ఘటాంతస్థితంబై ఘటాకాశమయ్యున్ మఠాంతస్థితంబై మ
ఠాకాశమయ్యున్నిజంబొక్క యాకాశమాకాశముల్పెక్కులైనట్టి చందం

బులఁ భ్రాంతిదోఁచుంగదా త్రిపురమథను ఫాలనేత్రుం ద్రిలోకీగృహస్థుం
ద్రయీవాటిమాణిక్యఖడ్గంబు బ్రహ్మాండకుక్షింభరిఁ శంభుఁ గుంభీనసగ్రామ
ణీకంఠహారుం గటీభారశాటీభవత్సింధుర క్రవ్యభుక్కృత్తి మృత్యుంజయుం
గూఢపాతుఃండలుం బాండురాంగుం గురంగాంక ఖండావతంసుం గిరీశుఁ ల
లాటేక్షణావిర్భవద్భీషణోషర్బుధజ్వాలమాలాసమాలీఢపుండేక్షుకోదండు
నిఁ భూభృద్ధనుస్స్వర్ణగర్దాహలీలాకళాదోహళవ్యాళ హాలాహల గ్రాసకల్మా
షకంఠోపకంఠుఁ నమద్బ్రహ్మవైకుంఠముఖ్యామర గ్రామకోటీరకోటీమణి
శ్రేణిశోణప్రభాజాల బాలాతపస్మేర పాదారవిందుఁ భజింపం దగుఁ స
త్క్రియారంభ కాలంబునఁ జనకకనకశైలకోదండుఁ డల్పుండు గాఁ జూచి
చేతం డికల్పాంతసంధ్యామహాతాండవాడంబరారంభ సంరంభసంక్షోభితా
శేషలోకప్రపంచుండు వంచింపనర్హుండు గోయయ్యత్రయ్యంతవిద్యావధూర
త్నసీమంతసిందూర పాంశుచ్ఛటాపాటల శ్రీపదాంభోజయుగ్మండు తన్మా
త్రుఁడే తాత దైతేయ లీలావతీగండపాళీపరిన్యస్తకస్తూరికాపత్రవల్లీ మతల్లిక
ళాదోహి బాహార్గళాస్తంభుఁ వై నీకవష్టంభసంరంభ మేలయ్య యీలాగు
నఁ మధుమథనమహాప్రబుద్ధుండవీవిట్టి దుశ్చేష్టితం బెట్లు వీక్షింపుచున్నాఁ
డవజ్ఞాస్తనీయిల్లు వేల్పుండ నీబండ దుర్గోష్ఠిలోఁ గూడియున్నాఁడ వింకొక్క
నాఁడైన నే మోమునం జూచెదీశాను పాదాబ్జములఁ వహ్ని యీకూడు దీపమ్మ్యే
నేనీకు నిర్భాగ్య యేణాంకయుంతశికళంకంబు దెల్లంబుగావించితి న్నాళ్ళకుఁ
లెస్సగాకేమి పౌలస్త్యనిన్నుం గనుంగొన్న సిగ్గయ్యెడుఁ శక్రనీ మొక్కళం
బుల్ వినంబడ్డవే కావె వాచస్పతీ నీచరిత్రంబు నీచంబు చాలుఁ వృథాలాప
ముల్ సేయు నీయున్నవారింద ఱున్నారు చూడంగ నేఁడెల్లి యెల్లుండి యీలో
ననే పాకముం బొందనున్నారొ యేదుర్గతిం జెందనున్నారొ యేయాపదం దూ
లనున్నారొ యేపంచలం గూలనున్నారొ యీమీఁద దైవంబె యుంగుఁ॥
వ॥ అనిపలికిభవానికన్ను మొగిచిన॥ సీ॥ పాదపద్మములందుఁ బ్రభవించునప్పు
డు ప్రత్యగ్రయావకద్రవము చెలువు। కటిమండలంబుపైఁ గనుపట్టునప్పుడు క
నకకాంచీదామకంబుడాలు। వలుదచన్నులమీఁద మొలతెంచునప్పుడు కా
శ్మీరజాంగరాగంబుపోలువు। సీమంతపదమునఁ జిగురొత్తునప్పుడు రమణీయ
సిందూరరజముసొబగు। ప్రోదిసేయుచు భుగ్గన భుజగహారు। రాణివాసంబు దివ్య
విగ్రహమునందు। రవ్వలుకొని మించె నాస్థానరంగభూమి। నధికరోషోద్ధితంబు
రోషానలంబు। సీ॥ అకోౖఁశమొనరించెహాహాస్వనంబుతో బంధువర్గముశోక
పరవశమున। మొగములు దెల్లఁగా మునులు దేవతలును భీతిల్లి చేతులు పిసికి

కాసిరి। చ్యుతవికీర్ణకటకము స్రుక్స్రువప్రకరమై విభ్రాంతిఁ బొందె ఋత్విగ్గణంబు।
ప్రజ్వరింపఁగరాని భంగిగా శోకభంగిఁ దఱుచుగా నుండె వైతానవహ్ని పుట్టె
నుత్పాతములు పెక్కు భువిని దివిని। విశిఖిపోయిరి యొకపాటి విబుధమును
లు। యజ్ఞవాటంబునందుఁ గామారి దేవి। యోగవహ్నికి దేహమాహుతియొ
నర్పు॥ గీ॥ భామతోఁ గూడివచ్చిన పారిషదులు। వేగమున నేగి సతిసుద్దివిన్నవిం
ప। భవుఁడు కోపించె భ్రూకుటీభయదఫాల। భాగుఁడై యప్పుడొక మహాప్ర
భజనించె॥ వ॥ ఆప్రభామండలంబునకు మనొక్క దివ్యపురుషుండావిర్భవించి
యమ్మహాదేవునకు నమస్కరించి॥ సీ॥ వదనంబు దెఱచి భ్రమింగుదునె బ్రహ్మాం
డంబు పలుమోవకుండంగఁ బాండురాంగ। పిండిపీచంబుగాఁ బృథివీధరంబు
లుదంతునే కాలదండమున నభవ। దండశూకాధీశులిలలు దండసిలంగఁ దాటిం
తునే కాలధర మహేశ। ప్రచ్చి పైతునె కేలివాలారునఖముల సకలదిక్కులు శ
శాంకార్ధమకుట। యేమి సేయుదు నానతీయుమ్ము నాకు। ననుచుఁ గ్రమ్మఱ మొ
క్కి బాహాస్ఫలించి। తన్మహాధ్వనిఁ గలఁగి యుత్కటములగుచు। జడధులేడు
నుఘూర్ణిల్ల శంభుసుతుఁడు॥ వ॥ అనిన రుద్రుండతని క్రోధోద్రేకంబునకు
వీరరసలేఖాముద్రకుం బ్రమోదంబంది భద్రనీకు వీరభద్ర నామంబిచ్చితి న
వ్యాక్షేపంబున దక్షయజ్ఞంబు సంక్షయంబు నొందింపుము ప్రమథాక్షోహి
ణీబలంబు నీకు సహాయంబయ్యెడునని యానతిచ్చిన మహాప్రసాదంబని విరూ
పాక్షుం బ్రదక్షిణీకరించి దక్షిణాభిముఖుండై ధాటీసంరంభంబున నరిగె నప్పు
డు॥ క॥ సంగడిఁ బిఱుందముందట। నింగియు నేలయును నిండి నిష్ఠురభంగిం।
బుంగవకేతను సుభటులు। భంగురవీరప్రతాపభయదస్ఫురణన్॥ క॥ కొండ
లు మహీరుహంబులు। గండోపలములు ధరించి కహకహనగుచున్। మెండుకొని
యజ్ఞవాటిక। కొండొరులను గడవ నరిగి రుద్భటభంగిన్॥ వ॥ అందుఁ గొందఱు
యూపస్తంభంబులు ఘాటించిరి కొందఱు కుండంబు పూరించిరి కొందఱు మం
టపంబులు పడఁద్రోచిరి కొందఱు వేదికలు గ్రొచ్చిరి కొందఱు హవిస్సులు భ
క్షించిరి కొందఱన్నంబులారగించిరి కొందఱు పాయసంబులు మెసఁగిరి కొం
దఱు పిండివంటకంబులు మ్రింగిరి కొందఱు ఘృతదధిక్షీరతక్షౌద్ర పుండ్రేక్షు ఫ
లాదులాస్వాదించిరి కొందఱు యజ్ఞపాత్రంబులు పగులమొత్తిరి కొందఱు
స్రుక్స్రువంబులు విఱిచిరి కొందఱు శకటంబులు పీటతాటంబులు సేసిరి కొం
దఱు చషాలంబులు చెవులందగిలించుకొని రివ్విధంబున నిర్మర్యాదంబై నిరవ
గ్రహంబై పారిషదుల యాగ్రహంబులు చెల్లుచుండం గోపాటోపసమున్ని
ద్రుండై॥ సీ॥ తనమీఁద నైవంగదంభోళియెత్తినఁ జెలఁగి సంస్తంభించె జిష్ణు

భుజము। కైటభారాతిచక్రము ప్రయోగించిన వెసఁజక్కిలముఁబోలె విఱిచి
బోక్కెఁ। బటుచపేటంబునఁబండ్లుడుల్లఁగ మొత్తి పూషార్కువదనంబుబో
సిపుచ్చెఁ। జిహ్వముత్యంబు రాల్చినభంగినలవోక భగునిగ్రుడ్లులుధరఁబడఁగఁ
జిదిమె। నర్ధచంద్ర బాణంబునయజ్ఞమృగము। శిరముదెగనేసికట్టె నంబరము
మీఁద। ధాతసతిముక్కుశోణంబుదాఁకఁగోసెఁ। బ్రకటవిస్ఫూర్తిఁ శ్రీవీరభ
ద్రమూర్తి॥ గీ॥ ద్రోహులగు వేలుపులలోన దారలియున్న। పదియునొక్కం
డ్రురుద్రులఁబాఱవిడిచె। గాసిచేయక కాకోలకంఠుపట్టి। తిండ్రిపేరివారగుట
చిత్తమునఁదలఁచి॥ వ॥ అంత॥ క॥ సిగ్గువడివిఱియఁబాఱిరి। భగ్గనఁబోరివు
చ్చివీరభద్రునిధాటిఁ। నుగ్గులయియమవురుసవురయి। గ్రుగ్గులకాఁతై వికావికల
యియమర్త్యుల్॥ గీ॥ దక్షునల్లుండ్రమెడలసూత్రములుగట్టి। యూపములు
సూత్రములతోడనుద్దిసేసిఁ। దామెనలుగూర్చినడపించెఁదరతరంబ। వీరభద్రుం
డుపశువులద్రేల్చునట్లు॥ మ॥ పనిలేదేటికిబాధపెట్ట నను నీబ్రహ్మణ్యమైతో
మొఱో। యనియుత్తైచర్ధ్వనిఁగూఁతవెట్టమఖశాలాగ్రంబునర్థశాద్ధదే। వు
నిఁగట్టించెనువీరభద్రుఁడుభటవ్యూహంబుచే నాగ్రహం। బునధూమోర్జ
పయోధరద్వితయముర్ముద్ధాడుహస్తాబ్జముల్॥ క॥ తాపించెధనదువదనము।
గూపెట్టఁగఁగాలకంఠుకొడుకుత్తరవే। దీపాషాణాంచలమునఁ। బాపప్రయా
గమునఁదొటువిపడిరుత్తముల్॥ చ॥ మతకరిపాకశాసనుఁడుమత్తశిఖావళ
శాబకంబునా। కృతిధరియించిప్రాంతమునఁగేలిమహీధరశృంగమెక్కెనిర్వ
తమతినుండెవేలుపులవేదనఁబెట్టెడువీరభద్రును। ద్ధతిఁబరికించుచుర్ణసయప
థంబుబృహస్పతిచేతఁబట్టఁగఁడే॥ గీ॥ తత్తిగొనర్యముదీర్ఘదోర్దండయుగము।
క్రకచమునవీరభద్రుఁడుకరుణదొఱఁగి। త్ర్యంబకునిపట్టిపవనువధ్యంబుసేసె।
వానియంతఃపురస్త్రీలువనటఁబొంద॥ చ॥ వలపలికాలముక్కునసువాలెసు
ధారసముప్పతిల్లఁగా। వెలికిలవైచిమట్టిరణవీరశిఖామణివీరభద్రుఁడు। చ్చల
మునరోహిణీరమణుచారుశరీరముదత్పదాహతిం। గలిగినకందుగాఁదెపాడగా
నఁగనయ్యెడునేఁడుచిహ్నమై॥ గీ॥ ఈశ్వరద్రోహిగర్వాంధ బుద్ధిసురేంద్ర।
బంధునాశైకకారణపాపకర్మ। చావుమనియొక్కపెట్టునఁజక్రధార। దక్షుత
లద్రెవ్వవేసెఫాలాక్షుసుతుఁడు॥ వ॥ ఇవ్విధంబున మధుమథనచక్రాయుధం
బువిఱిచె జంభాంతకుభుజాస్తంభంబు సంస్తంభించె భగునికన్నులు కెలికెఁ
బూషుపండ్లువెఱికె మఖమృగంబు శిరంబుఖండించెదక్షుతలద్రెవ్వవేసెదా
క్షాయణీసుతుపొట్టగుజ్జుఱక మట్టుభారతీదేవిముక్కుచిదిమెఁ గాలివధ్యంబు
సేసెజమునిమెడదండెడగిల్చియదితియధరపల్లవంబుచక్కడదియుగ్నినాలుక

లుగోసినిరృతికలవట్టివంచికింపురుషపతి మొగంబుపాషాణపట్టంబునబిట్టురాచి యసంతరంబగరుడులం ద్రోలిఖచరులజోకొట్టి యచ్చుతులసిగ్గువుచ్చి కిన్నరులఁ దన్నిగుహ్యకులగోడుకుడిపి సాధ్యులం జెఱిచి రుద్రులంబఱపిమరుత్తులనుత్రా ళించివిశ్వులనైచి విద్యాధరుల వెలిచి గంధర్వులగారించియక్షులనధిక్షేపించి చక్షుశ్శ్రవులశిక్షించి చారణులజంకించి కింపురుషులఁబరిభవించి వీరభద్రుం డునాఁటు లేకములయుచుండె నిర్విఘ్నంబున॥ ఉ॥ తామరసాసనుండగుపితామ హుఁడారిమిపట్టి యైననూ। తామహాయాగతంత్రమునఁదంత్రముచేసికవాజ్ఞ విక్రమో। ద్దాముఁడువీరభద్రుఁడుపదంపడియుందఱఁగాచె దేవతా। గ్రామణు లందనూత్రవణవికారములన్నియు మానునట్లుగన్॥ గీ॥ రణములోనైన తనువి కారంబులెల్ల। దేవతలకుశమింపఁజెనద్దేవుకరుణఁ। దాల్చెదక్షుఁడుభవితవ్యతా బలమునఁ। గంఠనాళాగ్రమునయందుఁగలుగశిరము॥ గీ॥ శంకరద్రోహపా పప్రశాంతిఁగోరి। దక్షుఁడెంతయుఁగాలంబుదపముసేసె। బహుళకైవల్యసా మ్రాజ్యపట్టభద్ర। సింహపీఠికఁగాశికాక్షేత్రసీమ॥ వ॥ దక్షుండుతనపేరదక్షే శ్వరలింగంబుప్రతిష్ఠించె॥ గీ॥ అంబికకుఁబుట్టినిల్లునీహారశిఖరి। యత్తవారిల్లు కాశిమహాపురంబు। హిమకరోత్తంసునకుఁబుట్టినిల్లుకాశి। యత్తవారిగృహం బునీహారశిఖరి॥ వ॥ నర్మదేశ్వరుండుసరస్వతీశ్వరుండురత్నేశ్వరు పురోభాగం బుననధివసింతు రింకవ్యాసేశ్వరమాహాత్మ్యంబభివర్ణించెద॥ గీ॥ బాదరాయ ణుఁడఖిలభూపరిధియందు। సకలతీర్థంబులనునాడి శాంతబుద్ధి। నైమిశంబను పుణ్యకాంతారమునకు। నరుగుదెంచెనుశిష్యసంహతియుఁదాను॥ క॥ ఆతతమ తినతఁడష్టా। శీతిసహస్రములుఋషులుశిష్యులుఁగొలువంగా। నేతెంచిశిష్యులును దాఁ। బ్రాతఃకాలమునఁబొగడెఁబద్మేక్షణునిన్॥ వ॥ లక్ష్మీశ్వరుండదైవం బుజనార్దనుండెభుక్తిముక్తిప్రదాయకుండువిష్ణుధర్మంబెధర్మంబు॥ సీ॥ సత్యం బుభుజగేంద్రశయనుండెదైవంబు సత్యంబుదైవంబుచక్రధరుఁడు। సత్యంబు వైకుంఠసదనుండుదైవంబుసత్యంబుదైవంబుశాశ్వతుండు।సత్యంబుకైటభశ త్రుండదైవంబుసత్యంబుదైవంబుశార్ఙ్గకాధరుఁడు। సత్యంబువార్ధిజాసహితుండె దైవంబుసత్యంబుదైవంబుశ్యామతనుఁడు। మఱియుసత్యంబుదైవంబుమాధ వుండు। మఱియుసత్యంబుదైవంబుమదనగురుఁడు। మాటలేటికిదైవంబుమ ఱియుమఱియుఁ। బుండరీకదళాయతాక్షుండొకండె॥ వ॥ అనియీప్రకారం బున వారణాశియందుఁ బంచనదంబువం బాదోదకంబులందీర్థంబాడి యాది కేశవుఁబాంచరాత్రవిద్యాగమమార్గంబునసర్చించి విశ్వేశ్వరభవనద్వారంబు వనిలిచిదక్షిణహస్తంబెత్తి సకలవేదపురాణేతిహాససిద్ధాంతనిశ్చితార్థంబు

సత్యంబుసత్యంబుపునస్సత్యంబు వేదశాస్త్రములకుంబరంబైన జ్ఞానంబు గేశవు
కంటెంబరంబైన దైవంబు లేదనినవిని॥ శా॥ ఎట్టట్టావినమైలిమింక నాకెమా
తేజ్ఞాటుగాఁ జెప్పుమా భట్టారాయనినందికేశ్వరుండు విస్పష్టంబుగాఁ బల్కి
నం। బట్టెఁగంఠబిలంబు చెయ్యెదివియర్థరాదయ్యెవారాణశీ। హట్టస్థానము
నందు వ్యాసునకు శిష్యశ్రేణిభీతిల్లఁగన్॥ క॥ భుజవాక్సంస్తంభంబునఁ। బ్రజని
తభయుఁడగుచు ముట్టఁబడి మదిఁదలఁచెం। గజరాజవరదు గరుడ। ధ్వజుఁడప్పు
డయేగుదెంచె వ్యాసునికడకున్॥ వ॥ వచ్చి బాదరాయణుఁడ బుద్ధిమంతుండవి
ట్టియపరాధం బెట్టు చేసితనికినిసి నందికేశ్వరనాకుం బ్రియంబుగా నీలినియపరా
ధంబు క్షమించి గరుణార్ద్రదృష్టింజూడుమని వేఁడుకొనియె నప్పుడు సత్యవతీనంద
నునకు వాగ్భుజాస్తంభంబులు నివర్తిల్లెఁ గృష్ణద్వైపాయనుండును బహుప్ర
కారంబులం బరమేశ్వరుం బ్రస్తుతించి తనపేర వ్యాసేశ్వరలింగంబు ప్రతిష్ఠించె
నా వ్యాసేశ్వరు భజించువారలకు భోగమోక్షప్రదాయకుండనినవిని కుంభసం
భవుండు శంభునందనున కభివాదనంబు సేసి సవిస్రంభంబుగా నిట్లనియె॥ సీ॥ శై
వారి వాగ్భుజాస్తంభంబొనర్చుట నజ్ఞానవిరహితుండయ్యె నేని। భాగీరథీతటో
పాంతస్థలంబున లింగప్రతిష్ఠ గల్పించె నేని। పుణ్యపంచక్రోశభూతీర్థమహిమంబు
నెరవుగా సర్వంబు నెఱిఁగెనేని। ముక్తిమంటపమధ్యమునఁ బురాణంబులు శై
వంబు లేపొద్దుఁజదువునేని। దపములకు బాధకములు గ్రోధంబులగుటఁ। దెలి
సియు క్కింతయేనిఁ దితిక్ష లేక। యేల శపియించెఁ గాశిపుణ్యైకరాశి। గంధవతిప
ట్టియానతీకార్తికేయ॥ వ॥ అనిన గాంగేయుండౌర్వశేయ యడుగవలసినయ
ర్థంబయడిగితి సాత్యవతేయుండు వాగ్భుజాస్తంభంబునాటంగోలె బుద్ధిమం
తుండై యుండెఁ గాశికానగరంబు మీఁదంగోపించి బాదరాయణుండు శపించు
టకుం గారణంబు మీఁద వివరించెదఁ గాశికామాహాత్మ్యవర్ణనావిశేషంబు
వినుము॥ గీ॥ కలుగనీ కాశి శంభులింగములు కోట్లు। విశ్వనాథుండు లింగంబు శా
శ్వతుండు। గలుగనీ తీర్థములు గోట్లు గాశియందు। ననఘ మణికర్ణికయ తీర్థము
నియెఱుంగు॥ క॥ సేవ్యుఁడు విశ్వేశుఁడు స్నా। తవ్యము మణికర్ణికాప్రవాహజలౌ
ఘము శ్రోత్రి। తవ్యంబులు శంభుకథా। దివ్యపురాణములు గాశితీర్థమునందున్॥
సీ॥ వసియింపవలయు యావజ్జీవమనురక్తిపరతె వారాణశీపట్టణమునఁ। జక్రపు
ష్కరిణినిచ్చలుఁ దీర్థమాడంగవలయు సంకల్పపూర్వకముగాఁగ। నర్చింపవ
లయు గంధాక్షతంబులఁ బుష్పఫలపత్రముల విశ్వపతిమహేశు। నిలుపంగవల
యును నరసుపాటిలకుండ నాత్మధర్మస్వవర్ణాశ్రమముల। స్నానమహిమంబు
భక్తితాత్పర్యగరిమ। వినఁగవలయుఁ బురాణార్థవిదులవలనఁ। దనయథాశక్తి

వలయును దానమిడఁగ। గాశికైవల్యమున్నింటఁగాని లేదు॥ గీ॥ యాత్రవిధ్యు
క్తసరణిఁజేయంగవలయు। వలయుఁబరిపాటిక్షేత్రదేవతలఁగొలువ। వలదు
బొంకాడవలదుజీవములకలుగ। వలదుసగిరైనఁబరమర్మములువచింప॥ గీ॥ ప్రా
ణసందేహమైనఁబట్టిపట్టినందు। ననృతములుపల్కవైననుసౌర్వ్యశేయు। యన్య
రక్షింపఁదలఁచుటత్యంతమైన। పరమధర్మంబుగాశికాపట్టణమున॥ క॥ కాలాంత
కుకటకమునఁబ। పీలికఁగాచుటమహర్షిబృందారకయా। త్రైలోక్యంబును
గాచుట। పోలఁగనీధర్మసూత్రములుదెలియుమిటన్॥ గీ॥ తీర్థసన్న్యాసకా
రుడై ధీరబుద్ధిఁ। గాశివసియించు పెద్దలగారవించు। టధికధర్మంబుదానసాహ్లా
దమందు। వివిధకైవల్యసంధాయి విశ్వభర్త॥ సీ॥ కుదియించునది నెట్టుకొని
యింద్రియవ్యాప్తి మనసుచాంచల్యంబు మాన్పునదియు। మదిలోనమోక్ష
కామమువీడక సునది పాయంగనీడునది ప్రాణభయము। వ్రతదానధర్మసంరక్ష
ణార్థంబుగాఁగావించునదియాత్మకాయరక్ష। తత్కాలదేహయాత్రామాత్ర
మునఁగాకసమకూర్చునదిధాన్యసంగ్రహంబు। నణఁచునదిదంభముజ్జగించున
దియార్ష్య। యడఁగునదిరాగలోభగర్వోదయములు। శాంతిదాంతితితిక్షా
నృశంసతసత్య। నిరతుఁడగునదికాశిలోనిలుచునరుఁడు॥ క॥ ఒకవర్షశతంబుననొం
డొకతీర్థమునందుఁగల ప్రయోజనలాభం। బొకదివసంబుననానం। దకానన
మునందుసర్వదాసిద్ధించున్॥ క॥ నేమమున నొక్క ప్రాణా। యామంబునఁగా
శిఁబడయునట్టిఫలశ్రీ। సామగ్రియొండెడమును। గ్రామణిసాష్టాంగయోగగతి
గనరునరుల్॥ సీ॥ చక్రవాళపరీతసర్వసర్వంసహా ప్రథితతీర్థములలోఁ బెరుగుఁ
గాశి। కాశికాపట్టణశ్రీపంచకతీర్థ సమితిలోసారంబుజహ్నుకన్య। జహ్ను
కన్యాతీర్థసముదాయమునయందుఁగడుఁబెద్దమణికర్ణికాహ్రదంబు। మణిక
ర్ణికాతీర్థమజ్జనఫలముకంటెనువిశ్వనాథు దర్శనమధికము। విశ్వపతికంటెఁ
గైవల్యవిభునికంటెఁ। గాలకంపునికంటెముక్కంటికంటెఁ। దీర్థములు దైవము
లు లేవుత్రిభువనముల। సత్యమింకనుసత్యంబుసంయమీంద్ర॥ సీ॥ అఖిలకాల
ముశంభునర్చించినఫలంబు సకృదీక్షణమునను సంభవించు। భవసహస్రముల
సంపాదితంబగుపుణ్యా కొముక ప్రదక్షిణమునకుపమగాదు। పుష్పప్రదానంబుఁ
బోలంగ లేవుషోడశమహాదానకాండములుగూడి। తలసూడునశ్వమేధఫలం
బుపంచామృతాభిషేకవిధానమాచరింప। వాజపేయసహస్రపరివర్తనమున
గలఫలంబిచ్చునైవేద్యకల్పనమున। నిన్నియునుజిత్రగించి విశ్వేశునభవుఁ।
గాశికాస్థేశుభజియింపు కలశజన్మ॥ క॥ గొడుగులువింజామరములుఁ। బడగ
లునుందాలవృంతపటవాసములున్। మృడునికొసంగినధన్యుఁడు। పుడమి

సిత్తై కాశిపట్టణమునఁ బాలించుఁ॥ వ॥ మఱియు నాస్తిక్యబుద్ధివినయంబు మానావ
మానంబులవిక్రృతిలేమియుఁ గామిత్వంబసాధ్గత్వంబహింసయుఁ బ్రతిగ్రహవృత్తి
యు దాంభికత్వంబల్లుబ్ధతయు నాలస్యంబపారుష్యంబదీనత యాదిగాఁగల గు
ణంబులు గాశీతీర్థవాసికవశ్యంబును సంభావనీయంబులు॥ గీ॥ కలశసంభవవ్యా
సుండు గాశివిడఁద। నేలకోపించెఁ జెప్పుమఁ చీవడిగితి। బాదరాయణ కోపప్ర
పంచమునకుఁ। గారణము సెప్పెదను విను గారవమున॥ సీ॥ త్రిషవణస్నానంబు
దీర్చుభాగీరథి శివధర్మములు సెప్పుశిష్యతతికి। నుదరపోషణము సేయునుమాధు
కరవృత్తిలింగార్చనంబుగల్పించు నియతి। ముక్తిమంటపమధ్యమునఁ బురాణ
ము చెప్పుఁ బంచాక్షరంబు జపంబు సేయు। భూతిసర్వాంగీణముగ సముద్ధూ
ళించు ధరియించు రుద్రాక్షదామకములు। శ్రుతులు నాల్గు నేర్పఱిచిన సూ
క్ష్మబుద్ధి। బ్రహ్మసంవేదియాదిపురాణకర్త। భారతాఖ్యానసంహితాప్రథమ
సుకవి। గంధవతిపట్టి యానందకాననమున॥ వ॥ ఇవ్విధంబున సంబద్ధకాలంబు గా
శీనగరంబునఁ గృష్ణద్వైపాయనుండు శిష్యవర్గంబునుం దానును నపవర్గపదవిశ
ల్యాణలాభార్థంబు వసింప నమ్మునిమనస్స్థైర్యంబు పరీక్షింపం దలంచి విశ్వేశ్వ
రశ్రీమహాదేవుండు విశాలాక్షికిట్లనియె॥ గీ॥ బాదరాయణు భక్తియే పాటియ
దియొ। యరయుదము గాని యతఁడు భిక్షాటనమున। కేగుదెంచిన యుష్మాదిం
టింటఁ భిక్ష। గలుగకుండంగఁ జేయంగవలయు నీవు॥ వ॥ అనినన ద్దేవి మహాప్రసా
దంబని యఖిలభూతాంతర్యామిని గావునఁ గాశికానగరంబున గృహిణీగృహ
స్థులయంతరంగంబులనధివసించి భిక్షాప్రదానప్రతిష్టంభకారణం బై యుండెఁ
గృష్ణద్వైపాయనుండును॥ సీ॥ కాలోచితములై నకరణీయములు దీర్చి యరు
ణోదయముగాఁ ఘటకమున్న। యరుణాంశుమండలం బర్థోదయమునందు
సమయంబు వీక్షించి సంధ్య వార్చె। గంగలోఁ జక్రపుష్కరిణీహ్రదంబున నఘమ
ర్షణస్నానమాచరించె। నిలుచుండి జపియించె నియతి మైగాయత్రిసంఖ్యయష్టో
త్తరశతముగాఁగ। నగ్నికార్యము దీర్చెఁ గామారిఁ గొల్చె। ముక్తిమంటపికా
మధ్యమునఁ బఠించె। శివపురాణంబు మధ్యాహ్నసీమదాఁక। నపరనారాయ
ణుఁడు బాదరాయణుండు॥ మ॥ ఝుటితి సూర్యాతపలాశపత్రపుటికా శాటీప్రదే
శంబుల్ ఘటముల్ దామరపాకుల్ గుగ్గుళుల్ గండోలముల్ పూనిబా।
నటవేదంబుఁ బఠించుచుం గదిసి వైశంపాయనాదుల్ సము। ద్భట[illegible]ంగింగొలు
వంగ నేగ్గమునిభిక్షాకృత్యయాత్రార్థమై॥ గీ॥ నెట్టుకొని కాయభీతిం దడపట్టవగ
లు। తానుశిష్యులు నిల్లిల్లు దప్పకుండఁ। గాశికావిప్రగృహవాటికలనోవర్చె।

సకలవిద్యాగురుంకుభిక్షాటనంబు॥ శా॥ ధాతుశ్రీల్ పైలసుమంతజైమినులు
వైశంపాయనుండాదిగాఁ। జాత్రంబుల్ ధరియించియున్న దెసలక్ భైక్షంబు
వేడంగన। తత్రాఘేశ్వనమూళిపట్టణమునం గాశిందలంపన్నహా। చిత్రంబోగి
రమబ్బదయ్యె బుపికింజేకూరదయ్యెఁ దుర్దిన॥ గీ॥ తిరిగెనింటింటభిక్షాంప్రదే
హీయనుచు। బాదరాయణుఁడీశానుపట్టణమున। నొట్టు వెట్టినభంగి నేయుగ్మ
లియును। బిలిచియొకపట్టెఁడన్నంబుఁ బెట్టదయ్యె॥ గీ॥ వండుచున్నారమను
నొక్కవనజనేత్ర। తిరిగిరమ్మనునొక్క లేఁదీఁగబోఁడి। దేవకార్యంబు నేఁడను
తెలివదొకర్తు। ద్వారకవాటంబు దెఱవదు వనితయొకతె॥ వ॥ ఇవ్విధంబున భా
గ్యహీనుండు ధనంబునుంబోలె భిక్షాన్నంబు వడయ లేక మఠంబునకుం జని జఠ
రతురాధ్యాధాదూయమానమానసుండై కృష్ణద్వైపాయనుండు శిష్యులరా
వించియిట్లనియె॥ సీ॥ అక్కటా నేనేఁడు మీకు మధ్యాహ్నభిక్ష। బ్రహ్మపురి వాడఁ
గాశికాపట్టణమున। నబ్బదో నాకపో లెమహర్షులార। వాడవాడలనీ పెద్దవల్ల
కాఁట॥ సీ॥ దుర్భిక్షదోషంబు దొరకొన్నఁ గడపని కడపని గృహసూతకంబు
నందు। నింటఁ బీనుంగువోయిన యేని గడపని కడపని పెనుమ్రుక్కగవిసె నేని।
కువలయేశుండు దండువుగొన్న గడపని కడపని భవనంబు గాలె నేని। పితృకార్య
విధి సమాపించినఁ గడపని కడపని ముట్టంటు గవిసెనేని। వేళగాకున్నఁ గడపని వే
లుపులకు। మీఁదువోకున్న గడపని మిన్నకెట్లు। గడపెనింటింట నీకాశికాపుర
మునఁ। బుణ్యగేహిని యిది మహాద్భుతముగాదె॥ వ॥ పెద్దకాలమునం బట్టిమ
సమున్న వారమిక్కాశీపట్టణంబున భిక్షాన్నంబు పుట్టనిదినంబునుం గలదె కుతప
కాలంబునందు॥ సీ॥ ముంగిటగోమయంబున గోముఖముదీర్చి కడలనాలుగు
మ్రుగ్గుకళ్లు వెట్టి। యతిధినచ్చోనిల్పి యర్ఘ్యపాద్యములిచ్చి పుష్పగంధంబు
లఁ బూజచేసి। ప్రక్షాళితంబైన స్థపసిఁడిచట్టువమున నన్నంబునునిచి నెయ్యభికరిం
చి। ఫలపాయసాపూప బహుపదార్థములతో భక్తివిశ్వాసతాత్పర్యగరిమ।
బెట్టుదురు మాధుకరభిక్షభిక్షుకులకుఁ। గంకణంబులతో సూడిగములు రాయ।
గ్రమకరముల బ్రాహ్మణాంగనలుగాశి।నన్నపూర్ణభవానికట్టనుఁగుఁజెలులు॥
క॥ అపరమపురంధ్రిలయం। దేపుణ్యాంగనయు భిక్షయిడదయ్యెఁగటా। రేపా
డిమేలుకనియే। నేపాపాత్ముని ముఖంబునీక్షించితినో॥ గీ॥ వాడఁబారినయవి
వక్త్రవనరుహములు। భాజనంబులలోననిప్పచ్చరంబు। మీకు భిక్షాన్నములు
లేమి మాకుఁ దెలిసె। జేలపంటలుగొయ్యలే చెప్పగాదె॥ వ॥ చతుర్విధపురు
షార్థములకు, నకటపుట్టినిల్లైన యిక్కాశీపట్టణంబునకు నేఁడు భిక్షాన్నంబు
పుట్టమికిఁ గారణం బెయ్యదియో విచారింపవలామర్థించిరండనిన సల్లకాకయుని

గురుని రోగంబుననందఱువన్ని ముఖంబులకుం జని యేరువకరంబునుం బొడఁ
గాక క్రమ్మఱవచ్చి శిష్యులందఱు బాదరాయణునకిట్లనిరి॥ సీ॥ అవధరింపుము నా
రాయణావతార। బాదరాయణ కాశికాపట్టణమున। నవశరము లేదు సీయట్టి య
ధిక పుణ్యు। లుండనిప్పేటి నెట్లుగీడొంద నేర్చు॥ సీ॥ విశ్వేశ్వరుండెందు విచ్చేసి
యున్నాఁడు కైలాసశైలశృంగంబు విడిచి। ప్రవహించు నెందేని భాగీరథీగం
గయుపకంఠమున హోరమోయనంగ। నాఁకొన్నవారికి నమృతదివ్యాన్నంబు గృ
ప సేయు నెందేని గిరితనూజ। యుండుదుండి వినాయకుండెందు నొసలిపై యువ
రాజపట్టంబు నవధరించి। యెందులనునుండ్రుమీయంత లేసివారు। పరమపు
ణ్యులు సంయమీశ్వరుల సేకు। లట్టి కాశి నిభిత్సొన్న మబ్బదనుట। వినఁగఁబొసఁ
గు నెయిది యేమివిధముగాక॥ సీ॥ జలుఁగుసంధ్యారాగచీనాంబరము గట్టి కుసు
మగర్భముగఁగిల్కొప్పుఁదురిమి। కస్తూరితోఁగూర్చి గంధసారమలందిముత్యా
లతాటంకములు ధరించి। సీమంతపథములఁ జేర్చుచుక్కసవరించి కురులపైఁ జిన్ని
పూగుత్తరించి। శ్రీపాదముల హేమనూపురంబులు దాల్చి కటిమీఁద వజ్రాలక
మరునిల్పి। యన్నపూర్ణా విశాలాక్షియనెడు పేళ్ళ। గాశికామధ్యశృంగాట
కములయందు। విశ్వపతి దేవి మధ్యాహ్నవేళఁ బెట్టు। నమృతపాయసదివ్యా
న్నమనుదినంబు॥ గీ॥ మనము మనమన పూర్వజన్మములయందుఁ। గడపినార
ము మధ్యాహ్నకాలభిక్ష। యనుభవింపకపోవంగనలవియగునె। కమలజునకైనఁ
బ్రారబ్ధకర్మఫలము॥ క॥ అందఱు భుజంగభూషణు। లందఱునుంగాలకం
ఠులందఱు గిరిశుల్। అందఱుధృతేందుకళలా। నందవనీనగరనివసనస్థితులున
రుల్॥ గీ॥ బ్రహ్మలోకంబు గాశికిబడిసివాటు। విష్ణులోకంబు గాశికివినిమయం
బు। దాసదాసానుదాసబృందంబు గాశి। కింద్రచంద్రాదిలోకంబులిద్ధమహిమ॥
సీ॥ శివుని నివాళించు శేషాహిసడురేయి బహుఫణాగారత్నదీపముల చేత। సంత
తస్నాతంబులై యర్చించు నీశాను ఫలపుష్పములఁగల్పపాదపములు। కామధేను
వులిందు ఖండేందుశేఖరునూధస్యధారలనోలలార్చు। నిధులు దొమ్మిదియుగం
శేకాలునకు నిచ్చు నిర్మలమణులుగానికలుగాఁగ। గాశికాపట్టణంబు శంకరుని నె
లవు। గలిప్రవేశింపదానందకాననమున। శ్రీనివాసంబు వారాణసీపురంబు। ము
క్తిసంధాయకంబవిముక్తకంబు॥ వ॥ అని శిష్యులుగాశీమాహాత్మ్యంబు ప్రశం
సించిన విని బాదరాయణుండువారలకిట్లనియె॥ గీ॥ ఉపవసింతుముగాక నేఁ
డుడిగి ముడిగి। యస్తమించుచున్నవాఁడహిమభానుఁ। డెల్లిపారణకైన లే
దెట్టు మనకు। మాధుకరభిక్షబ్రాహ్మణమందిరముల॥ వ॥ అనియారాత్రిగడ
పి మఱునాఁడు మధ్యాహ్నకాలంబున శిష్యులుం దాను వేఱువేఱ వేదవ్యాసుం

డువిప్రభవనవాటికభిక్షాటనంబొనర్చి తొలునాఁటియట్లముక్కంటిమాయ
నేమచ్చకంటియునటకంబువెట్టకున్నఁ గటకటంబడి భిక్షాపాత్రంబు నట్టన
డువీథింబగులవైచి కోపాటోపంబున॥ గీ॥ ధనమదంబును వేదవిద్యామదంబు।
మోక్షలక్ష్మీమదంబునునుదిరెఁగాదె। కాశికాపట్టణంబునఁగరుణలేక। బ్రా
హ్మణులనన్నభిక్షభంగపఱిచిరనుచు ॥ వ॥ కృష్ణద్వైపాయనుండాత్మగతం
బున॥ గీ॥ ధనములేకుండెదరుమూఁడుతరములందు। మూఁడుతరములఁజెడు
గాకముక్తిలక్ష్మి। విద్యయునుమూఁడుతరములవెడలవలయుఁ। బంచజనునకు
గాశికాపట్టణమున॥ వ॥ అనిపారాశర్యుండుక్షుత్పిపాసాపరవశుండై శపియిం
పంజూచునవసరంబున నొక్కవిప్రభవనంబు వాకిటం బార్వతిప్రాకృతవేషం
బున॥ ఉ॥ వేవలిపాటపాటసరవెండ్రికతోఁదిలతండులాన్వయ। శ్రీనటియిం
పఁగాసడలివ్రేకనిచన్నులుపాలవంకలై। కొనసిరియార్చువాలుదెలికన్నులక
ల్కతనంబుపీడ్కొనన్। మానినిహస్తమూఁదిరియొకమంజులభాషిణివచ్చెవీథి
కిన్॥ ఉ॥ వేదపురాణశాస్త్రపదవీనదవీయసియైనపెద్దము। త్తైదువకాశికా
నగరహాటకపీఠశిఖాధిరూఢయు। య్యాదిమశక్తిసంయమివరాయిటురమ్మని
పిల్చెహస్తసం। జ్ఞాదరలీలరత్నకటకాభరణంబులుఘల్లుఘల్లనన్॥ వ॥ చేరం
బిల్చియమ్మత్తకాశినిసాత్యవతేయునకిట్లనియె॥ శా॥ ఆకంఠంబుగనిష్టమాధు
కరభిక్షాన్నంబుభక్షింపగా। లేకున్నంగడునంగలార్చెదవుమేలే లెస్సశాంతుం
డవే। నీకంటెన్మతిహీనులేకటకటా నీవారముష్టింపచుల్। శాకాహారులుగం
దభోజులుశిలోంఛప్రక్రముల్ దాపసుల్॥ గీ॥ ఓమునీశ్వరవినవయ్యయున్న
యూరు। గన్నతల్లియునొక్కరూపన్నరీతి। యటువిశేషించిశివునియర్ధాంగల
క్ష్మి। గాశియీవీటిమీఁదనాగ్రహముదగదు॥ గీ॥ వేయిశాఖలతోసామవే
దరాశి। యేకవింశతిభేదమైబుబ్బృగమము। తొమ్మిదియునూటయొక్కండు
దోవలంది। నొరిమెనాథర్వణయజుస్సులుండుగాశి॥ వ॥ ఇట్టికాశికానగరం
బుమీఁద భిక్షలేకుంటగారణంబుగానీయంతవాఁడు గటకటంబడిశపియింపం
దలంచునె బ్రాహ్మణుండవుగదా నీవేమన్ననుం జెల్లునటువిశేషించియాఁకొ
న్నవాఁడఁగావున నీయవసరంబున నిన్ను హెచ్చు గుందాడుట మముబోఁటి
గృహిణులకు మెచ్చుగాదుమాయింటికింగుడువరమ్మ కుడిచికూర్చున్నపిమ్మ
టంగొన్నిమాటలునీతోనాడఁగలనప్పుడు॥ గీ॥ వైశ్వదేవాదివిధులసర్వము
నుదీర్చి। యరయుచున్నాఁడునాథతిథియతిథిరాక। యతిథిపఙ్క్తికిరాకున్న
నారగింపఁ। డొంటిరెయొకనాఁడుపతియిట్టిరెయొకముఁజను॥ గీ॥ అభ్రిగంగను
పస్పృశ్యగూచరించి। వేగవిచ్చేయవలయునావిభుఁడుదశమి। యాఁకటికినొర్వ

లేఁడు బ్రాహ్మణవరేణ్య! యర్కమండలము దెవ్రా లెవ్వరదిశకు॥ వ॥ అనిన వే
దవ్యాసుం డప్పు డైదువ కిట్లనియె॥ గీ॥ కమలవో యనకిన్నరాంగనవొ నీవు। నీవు
గంధర్వభామవొ నీలవేణి। యప్సరస్త్రీవొ నీవు బింబాధరోష్ఠి। రమణి నీవు విద్యా
ధరరాజసుతవొ॥ సీ॥ కల్యాణి నిన్ను నీ కాశికాపురములో నెన్నఁడుఁ గానమే చెప్పు
మమ్మ। నిన్ను దర్శింపంగ నిఖిలేంద్రియములకు నత్యంతసంతృప్తి యావహిల్లె।
రాహుదంష్ట్రాంకురక్రకచఘట్టనభీతి జగతి కేతెంచిన చంద్రకళవొ। నన్ను రక్షిం
పంగ నాపాలఁ గల్గిన భాగ్యదేవతవొ తెప్పుదు నిజంబు। ఒండెఁ గైవల్యలక్ష్మి నీవి
యొండె నేని। గామినీత్వంబు గైకొన్న కాశిపురివొ। యొండెనాఁ గొన్నవారల
నూఱడించి। యమృతభిక్షాన్న మిడు విశాలాక్షి వీవు॥ గీ॥ చేయఁగలవాఁడ
నేను నీ చెప్పినట్లు। బ్రాహ్మణుఁడఁ గాన నాకుఁ జావలము ప్రకృతి। బుద్ధిఁ గృప సేసి ర
క్షింపు పుణ్యసాధ్వి। కాంత నీ పేరు నాకు నిక్కముగఁ జెప్పు॥ వ॥ అనిన నమ్మత్త
కాశిని సాత్యవతేయున కిట్లనియె॥ శా॥ ఊఁకో చెప్పఁగ నెంత యేనిదడ వానోవి
ప్రశార్దూలనీ। వాఁకొన్నాఁడవు భోజనోత్తరమునం దాస్థానమై యుండి యా।
త్రాఁకం బెట్టక చెప్పెదన్ సకలవృత్తాంతంబు నుండేటగా। వీఁకన్ వేళ యతిక్ర
మింపెఁ గుదుర్వన్ విచ్చేయు మా క్రమ్మఱన్॥ వ॥ అనినం బారాశర్యుం డయ్యా
ర్యతో నమ్మాయొక్క విన్నపంబు గలదాకర్ణింపుమని యిట్లనియె॥ గీ॥ అయుత
సంఖ్య శిష్యులా యాయి వీథుల। వేఱు వేఱ భిక్ష వేఁడి తేర। నేను నొక్కవీథి నే
కాంతవృత్తిమైఁ। బర్యటించి తెత్తుఁ బంచభిక్ష॥ చ॥ దినముదినంబు దప్పక యిట్లుఁ ద్రి
మ్మరి చాలఁగ భిక్షమెత్తి యేఁ। జను నెడఁ గూడ వత్తురు కృశానసమానులు నన్ను
బైలజై। మునిముఖులైన శిష్యులు సమిద్ధమతిం బురసూర్యవీథికన్। మును కొ
ని యొయ్య నొయ్య గతముం గతవల్లియు నుంబకించుచున్॥ గీ॥ శిష్యులును నేను
గూడి రాజీవనేత్ర। యాశ్రమమునఁ బాషాణమత్తాంతరమున। రాశివోయుదుము
కలపాత్రములయందు। నందఱును దెచ్చినట్టి భిక్షాశనంబు॥ సీ॥ పాఁడున పూ
పసూపపదార్థనివహంబు లేకీభవించిన నేర్పతించి। యన్నింట సగమతిథ్యభ్యా
గతార్థంబు భాజనంబుల నించి పాయఁ బెట్టి। సగము భాగీరథీసలిలధారాప్రపూ
రంబునఁ బ్రక్షాళితంబు సేసి। తారతమ్యము వృద్ధపురస్సరంబుగఁ బరిపాటి వే
ఱ్వేఱ బంతిసాగి। యర్థి నమృతాయతా మునియనుమతించి। యేను మున్ను ప్రా
ణాహుతు లెత్తఁ జూచి। చేయుఁ బ్రాణాగ్నిహోత్రంబు శిష్యకోటి। యొంత
యును గాలమీ వ్రతంబిట్లు సాగె॥ ఉ॥ ఎన్నఁడుఁ జూడ మున్ను నేమునిట్టి మహాద్భు
త మేమి చెప్పుదుము। గిన్నరకంఠి యొట్టిడిన కీలునఁ గాశీపురంబునందు భిక్షాన్నము
లేదు నీ యడుగులాన నిజంబుగ విన్నవించెదన్। నిన్నటనుండి యేము నిరు నీఁగియు

నుంటిమినిట్టుపాసముల్‌॥ ఉ॥ చట్టలుదప్పిమైనవురుసౌరయుచ్ఛాత్రులుదారుగా
శికా। హట్టములందుఁగూటికినుపాయములేక పరిభ్రమింపవా। నెట్టరిపోవని
మ్మనుచునింపుకయేనియుఁదాల్మిలేకయే। నెట్టుభుజించువాఁడధవళేక్షణయొ
క్కఁడనీగృహంబునన్‌॥ గీ॥ అస్తమింపంగఁజేరి నాఁడహిమకరుఁడు। శిష్యులే
కాకయుయుతింబుఁజిగురుఁబోఁడి। వ్రతముఁదప్పిభుజింపంగవలముగాదు। నేఁడు
నిన్నటిమాటలునాఁడునిక్కువంబు॥ చ॥ అనవుడునల్లనవ్వికమలాననయిట్లను లె
స్సగాకయౌ। మునివరనీవుశిష్యగణముంగొనిచయ్యనరమ్మువిశ్వనా। థునిక్కృ
పపేర్మినాదరతిథుల్‌ చనుదెంచినకామధేనువుం। బనిగొనునట్లువెట్టుదునపా
రముగైనయభీప్సితార్థముల్‌॥ వ॥ అనిననట్లకాక మహాప్రసాదంబని వేదవ్యా
సుండుశిష్యులంగూర్చికొని భాగీరథికింజనియుపస్పర్శంబాచరించియేతెంచిన॥
గీ॥ గొడుగుపాగలుగిలుకలుగులుకరింప । నిందుబింబాస్య నెదురుగానేగుదెం
చి। ఛాత్రసహితంబుగాఁబరాశరతనూజు।బంతిసాగించెభుక్తిశాలాంతరమున॥
వ॥ అనంతరంబావిశాలాక్షీమహాదేవియనుభావంబున నమ్మహామునులముం
దటంగనకరంభాపలాశపాత్రంబులయందు విచిత్రంబుగాఁగంటకాపూపలడ్డు
వంబులునిక్షైనకుడుములువప్పంబులు నిప్పట్లుజిల్లెడు కాయలుదోసియలుసేవి
యలునంగరపూవియలుసారిపత్తెలుజొత్తరలుజక్కిలంబులు మడుఁగుఁబూ
వులుమోరండలుబుంద్రేక్షుఖండంబుఁబండ ఖర్జూరద్రాక్షానారికేళకదళీప
నసజంబూచూతలికుచ దాడిమీకపిత్థకర్కంధూఫలంబులు గసగసలుఁబెస
రుపులగములుఁశైఖసుగుడములునరిసెలుబిసకిసలయములవరుగులుఁ జిరుగడ
ముబడిదములు బులుపకులుబులివసుగులు నప్పడంబులుఁబప్పులు రొట్టెయలును
జాపట్లుపాయసంబులు గర్కరీకారవేల్ల కూశ్మాండనిష్పావకపటోలికా కో
శాతక్యలాబూశిగ్రూదుంబరవార్తాకబింబి కాకరవిందశలాటువులును గంద
యుబోందయుఁజారులుఁ దిద్యగూరలుఁబచ్చడులు బజ్జులుగిజ్జులువడియం
బులు గడియంబుగాయంబులును గంధతోయంబులునుండాలుఁబాలును వ
నుములుదినుములు బుడుకులు నడుకులునిడియును జలిమిడియును ద్రెబ్బడ
యువడయునునుక్కెరలుచక్కెరలు నేతులుదేనెతొలలు భిట్టునుగంటును
దోఁపలుబూపలుమోదకంబులు గుడోదకంబులు ముక్కలుమిరియపుచో
క్కంపుపేరుఁభాలిలమిలమిలని రాజనంపుమదుంగు టోగిరంబులు పాడబం
బులతోడంబానకంబులతోడం దిమ్మనంబులతోడదధిపిండ ఖండంబులతో
డమీఁగడలతోడమజ్జిగలతోడ నూరుఁగాయలతోడ నంబకళంబులతోడ
రసావళులతోడంగూడభుగభుగందొగపుఁగంపులతోడంబ్రతిభటించురామ

కామోదంబును కామకామోదంబుతో మంతనంబాడు మెంతుల నెత్తావులు మెంతులనెత్తావులతోఁ బిత్తరించు జీరకంబుల సౌరభంబును జీరకంబుల సౌరభ్యంబులతోడం ద్రస్తరించు కుస్తుంబురుకిసలయవాసనలును గుస్తుంబురుకిసలయవాసనలతోడం బిసాళించు గరివేపాకుపరిమళంబును గరివేపాకు పరిమళంబుతోఁ సంబంధించు కమ్మగసిందగంధంబును గమ్మగసిందగంధంబు తోడం దార్కొను నేలకుల సౌరభంబును నేలకుల సౌరభంబులతోఁ సాళగించు కాలాగరుకురంగనాభికర్పూరగంధసారనీహారవాఃపూరంబులవలపును గాలాగరుకురంగనాభికర్పూరగంధసారనీహారవాఃపూరంబులతోడం గలపించు మహిసాక్షిగుగ్గులుధూపధూమంబుల కమ్మదనంబును భోజనాగారగవాక్షమార్గంబుల వెడలి కాశికానగరఘంటావీథులం బౌరనాసికాపుటకుటీరంబులకుఁ గుటుంబకంబుగా మిరియంబు పెరిమయుఁ బసపుపసయుశ్శొంఠిసొబగు నావతేవయు సిందుప్పుచాగయుఁ గారాంబువ్వుమవ్వంబును జిప్పిలియొప్పును నల్లంబుమెల్లంబును జింతగ్రొజ్జురజ్జును బేలపిండి మెండును నిప్పుపూమొగ్గల యగ్గలికయు వెన్నపెన్నాటకంబును గలిగి యొక్కొక్కమాఱియుఁ దనకుం దాసనులివేఁడి కట్టావితో నావిర్భవించిన॥ సీ॥ తరుణకంకేళిపాదపపల్లవముచాయఁ ఠవణించు జడలజూటంబు ముడిచి। హైమంబులైన రుద్రాక్షకుండలములు శ్రవణపాశములందు సంతరించి। నిర్నాభిబిలముగా నెఱిపీఁగు బొజ్జపై సలిలకాషాయవస్త్రముధరించి। యాపాదమస్తకంబఖిలాంగకంబుల నవ్యభస్మోద్ధూళనంబొనర్చి। పాశుపతదీక్షరూపంబు వడసినట్లు। శాంతిపుంభావమొందిన సౌష్ఠవమున। బంతి నడిమికి నేతెంచి భవనభర్త। తపసులకు భక్తి నన్నంబు దారవోసె॥ గీ॥ ఆరగించెఁ జతుర్విధాహారములను। మనసుకోరికె నిండంగ మునిగణంబు। వారి బంతిన కుడిచె నావాసభర్త। ధర్మగేహిని తాలవృంతంబు వీవ॥ వ॥ భోజనానంతరంబునాస్థానమంటపంబున సుఖోపవిష్టుండై ధర్మపత్నియుం దానుగృహపతి బాదరాయణు రావించి కూర్చుండ నియమించి కనుసన్నఁ జేసి విశాలాక్షి నతనితో నాడఁగల మాటలాడుమనినన మ్మహాదేవి సాత్యవతేయునకిట్లనియె॥ గీ॥ ఆరగించితె కడుపునిండారనీవు। శిష్యతతిభోజనంబు సేసెనె యథేచ్ఛ। సదసుఁదప్పినఁ దలఁగియుంతంతనున్న। వారులేరుగదయ్య మీవంగడమున॥ వ॥ అనిన బాదరాయణుండు మహాదేవి షడ్రసంబులయందు నొక్కొక్కరసంబు లవణంబును ననులవణంబును లవణానులవణంబనుమూఁడు ప్రకారంబులముయ్యెనుభేదంబుల నాస్వాదనీయంబులై చతుర్విధాహారంబులయందు మాజిహ్వకుం బండువు సేసె కడుపునిండ భుజించితిమి వాసరద్వయోపవాస సంప్రభూతజఠరగోళక్షుధా

గ్నితాపంబుశమించె నవసరంబుదప్పిభోజనంబు లేక యుంతంతనున్న వారమా
యుం దెవ్వరును లేరుమున్నెన్నఁడుంజూడమువినము నీయట్టియమృతంబుంగల
డె పాత్రంబులయందువిచిత్రంబులగునన్నంబులుసవ్యంజనంబులయితే మరుఁ
దామావిర్భవించు టెట్లు నీమాప్రభావంబుమీరఁ యెఱుంగుదురు మాకుఁజూడ
విశాలాక్షిపీయయ్య యా విశ్వేశ్వరశ్రీమన్మహాదేవుండును గావలయునని ప
లికినవిని యూశానియులెండు గాశీనగరంబునకుంజేసిన యపరాధంబునకుందగిన
శిక్షసేయుందలంచియిట్లనియె॥ క॥ మేలగుకాశీనగరం। బీలాగునభక్తిగలిగె నే
భోజనమే। వేళంబుట్టదువుట్టని। వేళలకున్ని దియుతగవు వేదవ్యాసా॥ ఉ॥ ఎట్టి
పురాణములెన్నదియు నెన్మిదిఁజెప్పితి వెట్టు వేదముల్। గట్టితి వేర్పఱించినుడి కార
ముసాం పెసలార భారతం। బెట్టురచించితీవుబుధి వెట్టయి తొక్కదినంబు
మాత్రలోఁ। బొట్టకు లేకతిట్టెదవుపుణ్యగుణంబుల రాశిఁగాశికన్॥ క॥ క్రోధం
బుఫలమెవిర్మలి। బోధమునకుఁదీర్ఘవాసమునకహర్ణం బే। క్రోధము వారాణశి
పైఁ। గ్రోధించిన విశ్వభర్త గోపింపఁడొకో॥ వ॥ వారాణశిము క్షేత్రనంబీతీ
ర్థముమీఁద నెవ్వండన్యాయము దలంచువాఁడురుద్రపిశాచంబగునని పలికి భ
వానీభవుని యానసనంబువీక్షించిన॥ గీ॥ కాశినుండంగనర్హుండు గాఁడు వీఁడు। వెడ
లిపొమ్మనుమాటలు వేయు నేల। క్రోధనుండెట్లు కైవల్యఫలగృహంబు। నాని
వాసంబు కాశికానగరమెట్లు॥ వ॥ అనివిరూపాక్షుండు పరుషాక్షరంబులఁ దన్ను
నధిక్షేపించి పలికినం గలంగి వడవడవడంకుచు వేదవ్యాసుండయ్యాదిమదంపతు
లపాదారవిందంబులకుం బ్రణమిల్లి యపరాధంబు సేఁతిఁ గోపంబుపసంహరింప
వలయునని ప్రార్థించిన॥ సీ॥ కాశికాపురిఁదొంటికట్టడనుండ నీపుణ్యకాలము
నందుఁబూతితిథిని। వచ్చువాఁడవు శివ్యవర్గంబు నీవును నైదుగ్రోశములకున
వుల నేల। నుండువాఁడవు పైఁడికుండలు ప్రాకారవలయంబుఁ బొడగానవచ్చు
చోటఁ। దక్కన్యతిథులఁదీర్థంబునిందింపకు బుద్ధిమంతుఁడవుగాఁ బొమ్ము బ్ర
ముకు। మంచునంతహీతుండయ్యె నగజతోడ। విశ్వనాథుండు మునియును వి
శ్వభర్త। యానతిచ్చినయట్లయుయుధినపించెఁ। గాశికాపురి కెడదవ్వగలుగు
నదని॥ గీ॥ అనినవినికుంభసంభవుఁ డాదరమున। నాంబికేయునకభివాదనంబు
సేసె। కాశిఁగలతీర్థములును లింగములునాకు। నానతిమ్మని ప్రార్థించియడుగు
టయును॥ వ॥ కార్తికేయుండొర్వశేయునకిట్లనియె॥ గీ॥ అనఘుయిట్టులమా
తల్లి మూడిగౌరంభు। హస్తములు మోడ్చియడిగెనఫికకరుణ। నానతిచ్చె విశాలా
క్షి యనెకు సేకి? యస్మదంబకుఁ గరుణ చంద్రార్థమౌళి॥ వ॥ విశాలాక్షి మోక్ష
లక్ష్మికింబుట్టినిల్లగు కాశీపట్టణంబున విశ్వేశ్వరాభిధానుండనైన నాచుట్టు

నుంబంచక్రోశమధ్యంబునవిరించిహరిపురందరాదిబృందారకవందనీయం
బులై గూఢంబులు నగూఢంబులు గూఢాగూఢంబులగు దివ్యలింగంబులుం
బుణ్యతీర్థంబులుం బావనవాపీకూపతటాకంబులు లెక్కించి చెప్పగోచరంబుగా
వుక్షేత్రమాత్రంబునం జెప్పెద సావధానమతివై యాకర్ణింపుము సారసలోచన
సాంస్వతేశ్వరుండు సారస్వతప్రదుండు నీలవేణిగోపీశుండు దాక్షిణ్యనిధియ
చలకన్యకదధీచీశ్వరుండు పాపమోచకుండు కనకకేతకీకుసుమగర్భపత్రసగోత్ర
గాత్రీశ్వరుండీమహామంత్రఫలప్రదాత లజ్జావతివిశ్వేశ్వరుండు గుజ్జుకల్పలతరు
పుతలోదరీ వేదేశ్వరుండు కరుణోదధికి శైశయగంధియాదికేశవుండు ఖలక్లేశ నా
శకుండు తవ్వంగిసంగమేశ్వరుండు తంగేటిజున్నురతిబోటిచతుర్ముఖేశ్వరుండు భ
యత్రాతయింతి శాంతికదేవి చింతామణికాంతకాంతికేశ్వరుండు సంతతికరుం
డు విపులశ్రోణికపిలాహ్రదంబు లఖిలమదగదాగదంకారంబు కిసలయోష్ఠియా
నస్యాయేశ్వరుండు కొంగుపసిండి ముగ్ధసిద్ధివినాయకుండు కామశుద్ధేను వుశర
ణ్యహిరణ్యకశిపులింగంబు ముంగిటినిధానంబు మందగమన మందాసురేశ్వరుం
డు మందారుజనమందారంబు. సురతిసత్కపీశ్వర స్కందేశ్వర ప్రసన్నవదనేశ్వ
రులు శాశ్వతైశ్వర్యసంధాయులు చండిప్రసన్నోదకుండంబు దురితఖండనంబ
ష్టాదశ యోగపీఠికాధిష్ఠాత్రి యట్టహాసేశ్వరుండు ఘటికాఘ ప్రఘట్టుండు జగ
ద్ధాత్రిమిత్రావరుణవృద్ధవిశిష్టకృష్ణ యాజ్ఞవల్క్యప్రహ్లాదవైరోచనేశ్వరులు స
ర్వాధీనఫలప్రదాయకులు పల్లవపాణి బాణచంద్ర విద్యేశ్వరుల భద్రవిద్రావ
ణులు కర్ణమోటీనికటాదేవి జంభేటికాలువగౌరీపేశ్వరుండు వారాణశిపం
చముద్రమహాపీఠపట్టాభిషిక్తుండు లీలావతీవాలిహనుమదాశ్వినేశ్వరుల లిం
గంబులు మంగళప్రదంబులు వెండియు॥ దండకము॥ వినుమభినవవిద్రుమాతా
మ్రదంతచ్ఛదాభద్రకుండంబు గంధూపితాశేషదోషంబు భద్రేశ్వర శ్రీమ
హాదేవుఁడుండుండుఁ దత్కుండపూర్వోత్తరాశావిభాగంబునం జక్రకుండంబు
చక్రేశుఁడుండుండుఁ దత్సేవ సంసారచక్రక్రమప్రక్రియాధిక్కృతిప్రౌఢితనై
రుతాశంద్రికా ఉశ్వరుండుం కునాచేరువన్ శూలకుండంబు శూలాహ్రద స్నా
నజప్తంబులన్ మానవుండొందు నేనో నివృత్తిం దదగ్రంబునన్నారదేశుండు గో
కర్ణుం గోటితీర్థంబునం గాలకాధీశుఁడున్ దుర్గచాముండియున్ భార్గవేశుం
డున్ గాపిలేశుండు నోంకార మత్స్యోదరీతీర్థరాజంబులున్ శంకుకర్ణేశ్వరా
నాథేశుఁడున్ రుద్రదాసహ్రదంబున్ మహాపాతకోపద్రవోద్రేకవి
పాశిద ముద్రాసముద్రక్రాంతోదయసూర్యుత్తలైయుంద్రుమనాచక్క
గాస్తుతేశుండు సిద్ధేశుఁడుం గామ కుండంబులక్ష్మీనృసింహసత్యావన్యతేశానులుం

ఇంద్రకుండంబునిరంజేశచండేశ్వరాగ్నీశులును బాలచంద్రేశుండును వృద్ధకా
ళేశలింగంబు దక్షేశలింగంబు నైరావణాధీశలింగంబు ధన్వంతరీశానలింగంబు
ను దుంగనాథేశలింగంబు శ్రీభైరవాధీశలింగంబుదర్శించి మర్త్యుండుమృ
త్యూద్భవంబైన భీత్యుద్భవంబును బెడంబాయు వ్యాసేశ్వర వ్యాసకుండంబు
లును బంచచూడాసరోమధ్యమేశానమందాకినీతీర్థముల్ రామభద్రేశుండును
జంబుకశ్రీమతంగేశులును సిద్ధకూపంబుసిద్ధేశుండును వ్యాఘ్రలింగంబుశాతా
తపేశానుండును హారితేశుండు గాణాదకూపంబుగాణాదలింగంబునాపాధనా
థేశుండును భారభూతేశుండును శ్రీగభస్తీశుండును మంగళేశుండునుంద్వష్టల
నాథేశుండును దైవదైతేశుండును మంగళాదేవియును శ్రీమయూఖాంకుండును
వ్యాఘ్రపాదేశుండును శ్రీవిభాండేశలింగంబుసిద్ధేశలింగంబు నాలక్షకోట్య
ర్బుదన్యర్బుదానేకలింగంబులాకాశగంగాప్రతీరంబునంగాశికాక్షేత్రసీమావి
భాగంబునను భోగమోక్షంబులును సేవకశ్రేణికిం జాలుకల్యాణికాత్యాయనీదే
వినారాయణీశ్రీవిశాలాక్షి సత్యంబుసత్యంబుసత్యంబుసత్యంబుముమ్మాటికిన్॥
క॥ గంగాధరుసన్నిధిహారి। ముంగిటఁజదివినను విన్నముక్తిధరిత్రీ।లింగాభిధాన
మాలిక। భంగించునుబంచజనునిపాపౌఘములన్॥ గీ॥ ఒక్కపేరిలింగంబు
లుపెక్కుగలవు। కలవుపెక్కొకపేరివకలువకోలంకు। లొక్కపేరివకలవుపె
క్కువవనములు। గాశికాపట్టణమునందుఁగలువకంఠ॥ గీ॥అంధువులసంఖ్యలె
క్కింపవలవిగాదు। కుండములసంఖ్యలెక్కింపఁగోలఁదిగాదు। వాపికలసంఖ్య
లెక్కింపవలనుగాదు।పద్మలోచనకాశికాపట్టణమున॥ మ॥మునువున్మెచ్చుట
యున్నమహాస్యమునునున్మద్రించినానాదివో। కసులాస్థానముగూడియాడుదు
ధుర్శ్రీకాశీప్రవేశంబునన్। గసనైవుట్టుసుభాగ్యమైనమనసున్ గల్పింపదాదైవ
మా।కసుమాలంబగునాకమేలయనియుత్కంఠాతిరేకంబునన్॥ గీ॥ కాశిశివ
లింగకోటులఁగన్నతల్లి।కాశికైవల్యఫలదానకల్పవల్లి।గంగగారాబునెచ్చెలిక
త్తెకాశి।సురనరోరగదైత్యసంస్తుత్యకాశి॥గీ॥శైలసుతసర్వతీర్థైకజన్మభూమి।
సర్వవేదపురాణశాస్త్రములగరిడి।సర్వపాపౌఘజలదజంఝామరుత్తు। సర్వమో
క్షమ్ములకునునాస్పదముకాశి॥ఉ॥దుర్గహిమాచలంబుపయిదుస్సహమైనతప
సేసితి।ధూర్గరిమంబునన్ ననుగలూహాలిజేసితిపీవుగాశ్శైనై। సర్గికమైనతేజము
తసమందగజేయునన్నునీ।మార్గముకాశికానగరిమార్గముజూడుమ యొద్దిన
డో॥క॥పీవెంతప్రియువునాకును। దేవివిశాలాక్షిసర్వదేవనమస్యా। కైవల్య
నిలయముగ।శ్రీవారాణశియునంతప్రియమైయుండున్॥గీ॥ స్కందనందిమహాకా
రటీముఖులు। నైగమేషవిశాఖులునలినేత్ర।పట్టిచూడంగనాకెంతపరమ

ములు। పాదుకవిముక్తమునసున్న ప్రజలునెట్లు॥ గీ॥ వేల్పులైనారుతపంబుగావిం
చినారు। తీర్థములుసర్వములును సాధించినారు। కమలలోచనయానందకాననము
న। బాయకుండెడుజనులుప్రాగ్భవమునందు॥ గీ॥ భువనభారంబునకునగాఁగఁ
బుట్టినారు। కాశిఁగాపున్న ప్రజలుదక్కఁగలతాంగి। యక్షగంధర్వగరుడవిద్యా
ధరులును। దందశూకులునర్థవాదంబుగాదు॥ గీ॥ కాశికాపురినున్న పుల్కసునిఁ
బోల। రితరభూములనున్న వారెంతవారు। శ్రోత్రియులయింటఁబుట్టిశ్రుతు
లు నాల్గునభ్యసింపంగనీసరోజాయతాక్షి॥ సీ॥ సార్ధద్విసంఖ్యాధికోత్తమయోజ
నవచ్చుఁగాశిఁగాఁపురమున్న కాఁపుకోడుకు। కాశిఁబంచక్రోశికడసీమమొల
చినగరికతోఁ బ్రతిరావుకల్పకములు। కల్పాంతకాలంబుగరుసుదాఁటినాఁడు
కాశిముంపఁగలేదుకడలివెల్లి। బ్రహ్మాదులకుఁగాశిపాదచారముకానిమొక్కమ
ర్యాదలేదెక్కరింత। సుదతిపాపములకునుజాక్కుదురుకాశి। వెలఁదియుపపాత
కములకువిషముగాశి। భామకల్యాణమునకాటపట్టుకాశి। యింతిమోక్షముల
కుఁబుట్టినిల్లుకాశి॥ గీ॥ అగ్నికుండంబులనుదీర్థమాడినఫల। మన్నిలింగంబులకు
మ్రొక్కినట్టిఫలము। గలుగునీహారగిరిరాజకన్యనిజము। మరిగియాతీర్థములు
విన్న మానవులకు॥ సీ॥ జపియింపఁదగుఁబిత్రుశ్రాద్ధకాలంబులనిమ్మహాస్తోత్రమ
ద్రీంద్రతనయ। పంచమహాపాపభద్రేభపంచాస్యమిమ్మహాస్తోత్రమద్రీంద్రత
నయ। పఠియించువారలపాలికల్పద్రుమంబిమ్మహాస్తోత్రమద్రీంద్రతనయ। నా
కునత్యంతమనఃప్రమోదావహంబిమ్మహాస్తోత్రమద్రీంద్రతనయ। డాంబికునకు
ద్ధతునకునధార్మికునకుఁ। గూటసాక్షికిశఠునికిఁగృతఘ్నునకు। హేతువాదికిఁగ్రూ
రునకీనదర్హ। మిమ్మహాస్తోత్రరాజమద్రీంద్రతనయ॥ వ॥ అనిగంగాధరుండు కాశీ
లింగతీర్థవృత్తాంతంబు విశాలాక్షికివినిపించుచుండె నాసమయంబునమంద
రాచలంబుననుండిదివోదాసనివాసానంతరంబుగాశికేతెంచి బహిర్గేహంబునం
బట్టాభిషేకంబుగైకొని యంతర్గేహప్రవేశంబునకు శుభముహూర్తంబుప్రతీ
క్షించుచుండ నమ్మహోత్సవకాలం బాసన్నంబగుటయు నందికేశ్వరుం
డేగుదెంచియిట్లనియె॥ సీ॥ ఊర్జమాసంబుననుడురాజునభివృద్ధి ప్రతిపద్దినంబున
భాస్కరుండు। కనకహర్మ్యశిఖాగ్రకనకకుంభంబుగానభిజిత్తునందుమధ్యాహ్న
వేళఁ। బాఁలేయకరుఁడుసప్తమరాశితోఁగూడఁబంచగ్రహములుచ్చపదవినుం
డఁ। గరణంబుయోగనక్షత్రంబులును లెస్సగాలగ్నసంశుద్ధికలిమిమెఱయ। మం
చికాలంబుసాధించిమనముగెలిచి। బ్రహ్మహరివాసవాదులుపరమనిష్ఠఁ। గాచి
యున్నారుశ్రీరాకఁగాలకంఠ। వేగవిచ్చేయుముగేహప్రవేశమునకు॥ వ॥ అనినందికే
శ్వరుండువిన్నవించినం బరమానందకందళితహృదయారవిందుండై యుందు

శేఖరుండు విశాలాక్షీసహితుండై మోక్షలక్ష్మీవిలాసదర్పణంబైన యంతః
ప్రాసాదమందిరంబుం బ్రవేశించి సురభిగంధంబులై గంధవాహంబులు వొలసె
గంధర్వులు దివ్యగాంధర్వంబు సమంద్రకాదిమహాప్రబంధంబులు పాడ రంభాదిస
లాడిరి మహర్షులు హర్షించిరి చారణులు సంస్తుతించిరి ప్రమథులు ప్రమోదిం
చిరి విద్యాధరులు పుష్పవృష్టిం గురిసిరి చరాచరభూతజాతంబు సంప్రీతిమేదురం
బయ్యెఁ బంచమహావాద్యంబులు చెలంగె నిట్టు గిరిజాప్రవేశమహోత్స
వారంభంబు త్రిభువనదృక్కారంభంబయ్యె నయ్యవసరంబున॥ ఉ॥ వెగ్గలమైన
వాసనలు విశ్వజగంబును గ్రమ్మ వేఁగాఁ। గుగ్గులుధూపధూమములు గోచర
లీలనజాండగోళము। నగ్గలికం బటీరపవిమిశ్రణంబునఁ గాదె నభంబు గల్వపూ
మొగ్గయుఁ బోలె నివ్వెఱ సముంచితనీలిమఁ యయ్యెఁ జూడ్కికిన్॥ గీ॥ అవసరంబి
చ్చి శివుండు బ్రహ్మోచ్యుతాది। దేవతల గారవించె నతిప్రియమున। నటువిశేషించి
మధుకైటభాసురారి। నాదరించెను గారవంబతిశయిల్ల॥ గీ॥ నీకతంబునఁ గాదె
నాళీకనయన। కలిగెఁ గ్రమ్మ ఆనానందకాననంబు। తక్కరుండు నేర్చునే దివో
దాసనృపతి। విబుధసంక్షోభవిద్వేషి వెడలనడువ॥ వ॥ నీకుం బ్రియంబెయ్యది
యది యవరంబుగా నిత్తునని సనచ్యుతుండంబికావల్లభునకిట్లనియె॥ గీ॥ ప్రియము
నాకొండు గలుగునే త్రిభువనములఁ। గలదు ప్రియ మొక్కటి యచూడఁగాలకం
ఠ। వినుము కాశికాపురి నీ నివేశనంబు। కరుణసాంపార నిమ్మునీ పొరుగునందు॥ వ॥
అనిన శంభుండో గాక విశ్వంభర నాచేరువ నేయుండు మొదల నిన్ను నారాధిం
చి పిమ్మటఁ బ్రజలు నన్ను దర్శించువారి దె చూడు దక్షిణమంటపంబైన యీ
యపవర్గమంటపంబునఁ గాశీమాహాత్మ్యపుణ్యకథలు వినువది మఃకర్ణికాస్నా
నానంతరంబు ముక్తిమంటపంబునఁ బురాణంబు వినుటగ కృత్యంబు॥ గీ॥ కాశిఁ
దీర్థంబు లెన్నేనిఁ గలుగనిమ్ము। చక్రతీర్థంబు తీర్థంబు శార్ఙ్గపాణి। కాశిలింగంబు
లెన్నేనిఁ గలుగనిమ్ము। విశ్వపతి నేనలింగంబు విహగగమన॥ క॥ కైవల్యమంట
పంబిది। నావిహారణభూమి పద్మనాభ వినుము క్షేత్ర। శ్రీవనితాశుద్ధాంతము। గ్రైవేయ
విభూష కాశికాపురమునకున్॥ వ॥ ఈముక్తిమంటపంబునకు భవిష్యద్ద్వాపరంబు
నఁ గుక్కుటమంటపంబను నామాంతరంబు గలుగఁగల యదియా వృత్తాంతంబు
వివరించెద నాకర్ణింపు మానందకాననంబున మహానందుండను బ్రాహ్మణుండు గ్రి
వేది పిన్ననాఁడు పితృమాతృవియోగంబు నొంది యవినయనివాసంబైన యౌ
వనంబున విషయాసక్తుండై విషమశరశరశలాకాకీలితంబైన చిత్తంబున సుత్త
మాంగనను బౌరిగింటి బ్రాహ్మణుని భార్య మైత్రిచ్ఛద్మంబున నపహరించి య
పేరుపాపంబు భక్ష్యభక్షణంబు గమ్యాగమనంబు నాచారాచరణంబులు గృత్యం

